



వారందరు ఒకేలాగు లేరు,
కాని, అందరూ సంపూర్ణ
సాధకముగు

క్రూక్స్
# లాక్టో-కేలమైన్

వాడుచున్నారు.

నిష్కళంకమగు సౌందర్యానికి
క్రూక్స్ లాక్టో-కేలమైన్
ఉపయోగించండి.



మచ్చలను మరుగుపఱచి, కళంకములను కప్పి పుచ్చగల సంపూర్ణ సౌందర్య సాధకమగు క్రూక్స్ లాక్టో-కేలమైన్‌కు వేరేదియు తోడవసరము లేదు.

మీ సౌందర్యానికి యిదిగో ఒక చిట్కా

లోపములున్నవని లోలోన క్రుంగిపోతున్నారా? రోజూ లాక్టో-కేలమైన్ చర్మములోనికింకునట్లు మృదువుగా నిమురండి. క్రమముగా స్వాస్థ్యమును చేకూర్పగల కేలమైన్, విచ్ హేజల్ సహాయమున చర్మమున కంది యుండి మీ సౌందర్యమును పెంపొందింపజేయును.




క్రూక్స్
# లాక్టో-కేలమైన్

నిర్దుష్టమగు సౌందర్యానికి

భద్రతకొఱకై వేయబడిన క్రూక్స్ సీలు,
క్రూక్స్ చిహ్నము చూచి మరీ కొనండి.
మీకు లభించే ఇతర సౌందర్య సామగ్రి:
లాక్టో-కేలమైన్ టాల్కమ్ పౌడరు, క్రీము.
క్రూక్స్ ఇంటర్‌ఫాన్ లిమిటెడ్, బొంబాయి-25.



CIL. 72 TL

## వనితాలోకం

శ్రీమతి పరిమళా సోమేశ్వర్‌గారు వ్రాసిన మీ భార్య ఎలా వుండాలి అను శీర్షిక చదివిన తరువాత నా అభిప్రాయము తెలుపవలెనని వ్రాస్తున్నాను.

ఈ రోజులలో వేలాది భారత యువకులు కట్నం కోసము ఆశిస్తున్నప్పటికినప్పా, తాము (భారత యువకులు) పి. యు. సి. ఫెయిలైనప్పటికి తమ భార్యలు మాత్రం డిగ్రీ కలవారు కావాలని కోరుచున్నారనుట యు నన్ను ఆశ్చర్య చకితుణ్ణి గవించినది. రచయిత్రి కేవలం వారన్నగారు ఇలా వ్రాశారని





# ఉత్తరాలు

వేలాది మంది అలాగే వుంటారని వూహించుట పొరపాటు. అదిగాక ఆడవారు మాత్రం తమ కన్న తక్కువ చదివిన భర్తల నెన్నుకుంటారని కోపటం కూడా పొరపాటు. ఈ ఆడవారి వూహలు ఆడవారైన రచయిత్రి గార్కే తెలియాలి. అందుకనే త్వరలో మీ భర్త ఎలా వుండాలి అను శీర్షికను గూడా పత్రికలోకానికి అందజేస్తారని ఆశిస్తున్నాను. (మరి వారి వూహ ఎలా వుంటాయో) వారి గొంతెమ్మ కోర్కెలు ఎలా వుంటాయో!

యం. శ్రీనివాస్, (కొత్తగూడెం కాలరీస్)

* * *

"శ్రీమతి పరిమళా సోమేశ్వర్" గారి "భార్య ఎలా ఉండాలి" చదివాను. వారి మనో వేదనను సహృదయంతో అర్థం చేసుకొన్నాను.

ఈ మగువలు, మగవారి లోపాలను ప్రతి పత్రికలో వ్రాస్తున్నారు. కాని అదే సమయంలో తమ లోపాలను కూడ ఎందుకు తెలియ జేయరు. స్నేహితుడు తన భార్యతో మాట్లాడినంతమాత్రాన అతను కోపం తెచ్చుకుంటాడని వ్రాశారు రచయిత్రి. నిజ మాలోచిస్తే ఈ ఈర్ష్యాభావం స్త్రీలలోనే యుంటుంది. తన భర్త పరస్త్రీతో సహృదయంతో మాట్లాడితే చాలు అసూయతో సగం చచ్చిపోతారు. ఇంతకి చెప్పేదేమిటంటే లోపాలు యిరువురిలోనూ ఉంటాయి. వాటి నర్థం చేసికొని, సక్రమంగా ప్రవర్తిస్తే ఏ బాధా ఉండదు. ఇలా పత్రికా ముఖంగా ఒకరినొకరు నిందించుకొంటూంటే ఐక్యత లోపించడం తప్పిస్తే యింకే లాభంలేదు.

కొండేగుల వెంకట సూర్యేశ్వరరావు, (అనకాపల్లి.)

* * *

మీ వారపత్రిక అభిమాన పాఠకులలో నేనొకణ్ణి ఈ మధ్య మీ పత్రికలోని 'వనితాలోకం' శీర్షిక చూస్తూఉంటే, ఇది వనితలకు ఉద్దేశించిన శీర్షికా, లేక పురుష ద్వేషానికి ప్రతీకంగా ఏర్పాటు చేసిన శీర్షికా, అనిపిస్తుంది. వనితాలోకం శీర్షిక వనితలకు కొన్ని ప్రయోజనకరమైన విషయాలను తెలియపరచే శీర్షిక అనుకొన్నాను. కాని నా ఉద్దేశ్యము తప్పని, ఈ మధ్య మీ పత్రికలో ప్రచురింపబడిన కొన్ని వ్యాసాలవలన తెలిసింది.

వనితల సమస్యలను గూర్చి కొందరు వనితామణులు వ్రాసిన వ్యాసాల్ని మీరు ప్రచురించారు. ఈ వ్యాసాలు, స్త్రీల సమస్యలకు పరిష్కార మార్గం చూపే మాటెలాగున్నా, పురుషులను నిందించటానికి బాగా ఉపకరించాయి. మానవ జీవితాన్ని ఒక రథముతో పోల్చినట్లయితే, స్త్రీ పురుషు లిరువురు, ఆ రథానికి చక్రాల వంటివారు. ఈ చక్రాలలో ఏ చక్రం విరిగినా, రథము నడువలేదు. ఈ విషయాన్ని విస్మరించరాదు. అదీ గాక, ఒక విషయాన్ని గురించి చర్చించేప్పుడు, ఆ విషయాన్ని వివిధ కోణాల నుండి పరిశీలించాలి. కాని మీ పత్రికలో ప్రచురింపబడుతున్న వ్యాసాలు ఒక కోణము నుండి పరిశీలించినవిగా ఉంటున్నాయి. ఇది విచారించ దగ్గ విషయం. స్త్రీల సమస్య లన్నిటికి పురుషులే కారణ మనడం హాస్యాస్పదం. స్త్రీల కొన్ని సమస్యలకి స్త్రీలే అసలు కారణమన్నా తప్పులేదు. అదిగాక, విమర్శకులకు సహృదయత ఉంటే మంచిది. వ్యాసకర్తలు, ఉదహరించిన కొన్ని దుర్గుణాలు, పురుషులలోనేగాక, స్త్రీలలో గూడా ఉన్నాయని గమనించాలి. పిల్లలకు తల్లి దగ్గర చనువెక్కువ కద! పిల్లలను చిన్నతనం నుండి, ఆదర్శవంతంగా, ఉన్నత పంథాలో పెంచితే ఈనాడున్న సాంఘిక దురాచారాలు త్వరలోనే సమసి పోగలవు. ఈనాటి యువతీయువకులలో, అనర్థ దాయకమైనట్టి సిప్రపంచలనాన్ని కలిగించగల, పక్షపాతముతో కూడుకున్నటువంటి ఇట్టి వ్యాసాలు ప్రచురించవద్దని నా ప్రార్థన. పాఠకుల అభిప్రాయాల్ని మన్నిస్తారని ఆశిస్తాను.

యమ్. సుబ్బారెడ్డి, (తెనాలి.)

* * *

ఈ వారం (22-9-67) ఆంధ్రసచిత్రవార పత్రికలో వెలువడిన 'మీ భార్యలెలా ఉండాలి' అనే వ్యాసం చాల బాగుంది. ఆవ్యాసం వ్రాసిన సోదరి, శ్రీమతి పరిమళాసోమేశ్వర్‌గార్కి నా అభివందనములు.

ఆ వ్యాసంలో భార్య చదువులపై భర్త ఉద్దేశాలు విమర్శిస్తూ, 'ఆఖరికి పి యూ సి ఫైల్డ్ కూడా గ్రాడ్యుయేట్ అయిన భార్యలయితే బాగుండునని కోరుకుంటా'డని రచయిత్రి వ్రాశారు. అలా కోరుకోవటంలో తప్పేమిటో నాకు తెలియటం లేదు. యువతులు తమకు కాబోయే భర్త ఏ యింజనీరో, డాక్టరో, యింకా పెద్దపెద్ద హోదాలను కల్గియుండాలని కోరుకోరా? తమకంటే, తక్కువ చదువుకొన్న వారిని పెండ్లి చేసుకోలేని స్త్రీలు 'ఎక్కువగా చదువుకొన్న వాళ్ళు కావాలి' అని కోరుకోవటం ఎంతవరకు? అలా కోరుకోవటం మగవారుచేసిన, ఆడవారు చేసినా విదుల వారికి హీనతను యిచ్చినట్టు.. అంతేగాని కనీస మర్యాదనైనా పాటించినట్లు మాత్రం కాదుకదా?

స్త్రీ తన భర్తను, ఆయన చదువు, హోదాల గూర్చి ఎలా కోరుకుంటుందో పురుషుడు అలాగేనని నా ఉద్దేశం. స్త్రీలు కూడా ఉన్నత విద్యకై మగవారితో సమానంగా ఉన్నప్పుడు అలా కోరుకోవటం తప్పుకాదేమో. ఈ మాట రచయిత్రి వ్రాయకుండా వుంటే వ్యాసం యింకా బాగుండేది. కాకపోతే 'భార్యల కంటే భర్తలు ఎక్కువగా చదివి ఉండాలి' అని రచయిత్రిగారి ఉద్దేశం అని అనుకోవాల్సి వుంటుంది.

"సుప్రభారేణు", (వండూరు)

# రచయితలకు మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపకోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగినమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపకూడదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగినమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పరిమితి ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

**షరా:** వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా **తిప్పిపంపే** ప్రయత్నాలు **చేస్తాము** కాని, వాటి విషయములో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# ఉత్తరాలు

## కథలు

తెలంగాణా ప్రాంతపు భాషమీద విసురువేస్తున్న దాడి గత ఏడెనిమిదేళ్ళుగా జరుగుతూనే ఉంది. దానికి తోడయా కథానికా రచయితలు న్యాయం చేకూర్చడం లేదనేదే నా బాధ. 'పొద్దువాలే దగ్యాలు' రచయిత తెలంగాణాలోని ఏ జిల్లా భాష వాడరో చెప్పడం కష్టం. కొన్ని వివరాలు ఇస్తాను. 'సూర్రుడు' రచయితనాడిగిన ఎదనికి మా ప్రాంతంలో 'సూర్యుడు' అనే ఉచ్చారణ వాడుకలో ఉంది. అసలు తెలంగాణములో దీర్ఘాలు వాడరు. అలాగే 'ఒర్రుతున్నాయి' (ఒర్లుతున్నాయి) 'యింకోగాండ్ల' (యింకోదిండ్ల 'దట్కున్నది' (తట్కున్నది) ఇంకా ఎన్నెన్నో తప్పు ఉచ్చారణలను, రచయిత తన ఇష్టంవచ్చినట్లుగా మార్చేసి భాషకు కని విని ఎరగనంత అసహ్యాన్ని కలిగించారు.

తెలంగాణాభాషమీ ఏదో రిసెర్చి చేస్తున్నామన్న ప్రేరణతప్ప యిందులో ఏముంది? ప్రాంతీయతత్వాన్ని రెచ్చగొట్టటం తప్ప దీనివల్ల ఆశించేదేమిటి? (తెలంగాణా ప్రజల విముక్తికి ఆంధ్రపత్రిక అలనాడెంతో సేవ చేసింది. ఆ పత్రికనుంచి ఇది ఆశించేది)

జి. వెంకటరమారావు, (నిజామాబాద్ జిల్లా)

* * *

పి. సత్యవతిగారు రాసిన "ఇంటిదీపం" అన్న కథ చాలా బాగుంది. మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తుంది.

వి. యల్. కాంతం, (ఖర్గపూర్)

## కార్టూన్

29—9—67 పత్రికలో 15—9—67 పత్రిక 37 వ పేజీలోని కరెంటుమీద వేసిన కార్టూను మీద పద్మజ (హైదరాబాద్) గారు వ్రాసిన వ్యాఖ్యానం చూసి నేను వ్యాఖ్యానం వ్రాస్తున్నాను. కార్టూన్ అనేది వాస్తవానికి దగ్గరగా ఉండక్కరలేదు. దూరంగ ఉన్నా ఫరవాలేదు. చెడు ఉన్నా మంచి ఉన్నా నవ్వు తెప్పించేదే కార్టూన్. నవ్వు తెప్పించని కార్టూన్లు కూడా ఉన్నాయనుకోండి. పై కార్టూన్ ఎలక్ట్రిక్ డిపార్టుమెంటు వారి అశ్రద్ధని "అన్యోక్తి" రూపంలో చూపించింది. కాబట్టి దాన్లో తప్పులేదు. 2.30 కి ఆరంభించే సినిమాకి తెల్లవారు 6 గం. ల నుంచి హాలు దగ్గర పడిగాపులు కాసేవారు వారంరోజులు పడిగాపులు పడిఉన్నా ఆశ్చర్యం లేదు.

పి. రవిచంద్రరావు, (విజయవాడ)

## గురజాడ జయంతి

నవంబరు ఆఖరివారంలో గురజాడ జయంతిని జరపడానికి 'సారస' నిర్ణయించింది.

మదరాసులో నివసిస్తున్న తెలుగు రచయితలందరూ తమ పూర్తి చిరునామాలను కార్యదర్శికి (1. శివప్రకాశముదలి వీధి, మదరాసు—17) తెలుప ప్రార్థన.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 20—10—'67

ప్లవంగనామ సం॥ ఆశ్వయుజ మాసం బ॥ విదియ

**సంపుటము : 60 సంచిక : 7**

స్థాపితము:
**1908**

ముఖ్య సంపాదకుడు :
**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు:
**శివలెంక రాధాకృష్ణ**

ఆంధ్రపత్రిక కార్యాలయము
**1, తంబుచెట్టి వీధి, మద్రాసు-1**

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : ప్రయివేటు మాస్టారులో కాంచన.

కథలు :

ప్రేమించిన పెళ్ళికొడుకు — 34
ఘెరావ్ — 48

సీరియల్ నవలలు:

మట్టిబొమ్మలు — 24
పూర్వాసంధ్యా ప్రవర్తతే... — 40

శీర్షికలు. వ్యాసాలు, సినిమా:

ఉత్తరాలు — 2, ఉమెన్ వార్డ్ — 5, వ్యాధిశ్లీలేఖ — 6, మనోరేకక్ — 8, ఆంగ్లపత్రికలు — 10, ఆఫ్రికాలో పుణ్యక్షేత్రం, వార్తలో వనిత — 12. ప్రశ్నావళి — 13, వ్యాసరచన పోటీలు — 14, ధర్మపథం — 15. చేతకానితనం— 16, కుటుంబ నియంత్రణ, డాక్టర్ కబుర్లు — 17, కుటుంబనియంత్రణ — 20, వారఫలం — 22, బాలసాహితి—23, అర్థర్జుని మరణం — 30, ఎందుకు? — 56, ఒకరకం విపరీతం—58, చిత్రలహరి, సినిమాడైరీ— 60, మూలాకార్నర్—63.


బెంగాల్ రాజకీయాల్లో ఆయన చేతులు కాల్చుకున్నారు


నువ్వు విడిపోదామనుకుంటున్నా నాకా ఉద్దేశం లేదు.
అజయ్ ముఖర్జీ
ప్రఫుల్ల ఘోష్


ఆహా! దానికి అర్థం నామీద ప్రేమ!
మిశ్రమ మంత్రి వర్గాలు
ప్రజలు
కాంగ్రెస్


కమ్యూనిస్టులతో చేతులు కలిపిన దానికి ఫలితం
అన్నాదురై
కమ్యూనిస్టులు
సృష్టించే
కలతలు

# భారత ప్రధానికి ఇంటి సమస్యా?

కాంగ్రెసువారు పూర్తిగా పరభాగ్యోపజీవులుగా తయారయ్యారు. ఇప్పుడు మంత్రుల నివాసగృహాలు, ఆఫీసులు మళ్ళీ మళ్ళీ కొత్తదనాన్ని చేకూర్చుకుంటున్నాయి. కుర్చీలు, బల్లలదగ్గర్నుంచీ కొత్త కొత్త అలంకారాలు కూర్చుకుంటున్నాయి. ఇటువంటి 'చిన్న విషయాలు' లెక్కల పుస్తకాల్లోకి ఎక్కవు గనక ఆడిటర్ జనరల్ నిస్సహాయులుగా ఉన్నారు. పన్నులు కట్టేవాళ్ళమీద మన మంత్రులు ఎంతగా సవారీ చేస్తున్నారో అంచనా కట్టడానికి ఎవరికీ వశం కాకపోతోంది.

మన మంత్రులు నిర్వహించిన ఘనకార్యాల సంగతి దేవుడెరుగు గాని, ప్రభుత్వం తరఫున మాత్రం బోల్డన్ని వాగ్దానాలు చేసేశారు. ప్రధానమంత్రితోసహా ముగ్గురు మంత్రులు 'కొచ్చిన్ షిప్‌యార్డ్' వాగ్దానం చేశారు. రవాణామంత్రి డా॥ రావ్‌గారు తూత్తుకుడిలో హార్బర్ ప్రాజెక్టుని వాగ్దానం చేశారు. అవసరం లేకపోయినా, ఢిల్లీలో మరో వైద్యకళాశాల నిర్మిస్తామని ఆరోగ్యమంత్రి గట్టిగా చెప్పారు. దక్షిణాదిన ఉక్కు కర్మాగారం గొడవ ఉండనేవుంది.

ప్రజలనుంచి పన్నుల ద్వారా వసూలు చేసిన సొమ్మును ఢిల్లీలోని జుమ్మామసీదుమీద వెచ్చించడానికి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు ఒప్పుకున్నారు. పన్నులుకట్టే వాళ్ళ డబ్బును వేటిపైనైనా ఖర్చుపెడతారో, వాటిని 'రక్షిత భవనాలు' అనడం పురాతత్వశాఖ అలవాటైపోయింది. మత సంబంధమైన హెచ్చుతగ్గులులేకుండా గుజరాత్‌లోని ద్వారకా ఆలయాన్ని పునరుద్ధరించడానికి నెహ్రూగారి కుమార్తె ప్రభుత్వం తరఫున అభయమిచ్చారు!

శ్రీమతి లలితాశాస్త్రిగారు పదవనంబరు జనపథాన్ని తమ భర్తకి జ్ఞాపకచిహ్నంగా తయారుచెయ్యాలని తహ తహ లాడుతున్నారు. ఆమె కోరికని బలపరచడానికి ఢిల్లీ మేయరు, జనసంఘంవారు అయిన శ్రీ హన్సరాజ్ గుప్తాగారు ముందుకు వస్తున్నారు.

ఇది రెండు ముఖ్యమయిన విషయాలని దృష్టికి తీసుకువస్తుంది. మొదటిది, ప్రధానమంత్రుల స్మృతిచిహ్నాలయిన భవంతులు. రెండవది, మామూలుగా మంత్రుల నివాసగృహాలగురించి, ముఖ్యంగా ప్రధానమంత్రి నివాసంగురించీను.

ఇదే బ్రిటన్‌లో అయితే, ప్రధానమంత్రి మరణంతర్వాత యాభయ్యేళ్ళవరకు అతనికి స్మృతిచిహ్నమంటూ ఏర్పడదు. ఒక ప్రధానమంత్రి నివాసాన్ని వస్తుప్రదర్శనశాలగా మార్చడమనేది భారతదేశానికి ఒక్కదానికే చెల్లింది. మరెక్కడా కనిపించదు ఇష్టపడినా, పడకపోయినా ఇంగ్లాండు ప్రధానమంత్రి పదవనంబరు డవునింగ్ స్ట్రీట్‌లో వుండాల్సిందే. అలాగే అమెరికా అధ్యక్షుడు వైట్‌హౌస్‌లోనే వుండాలి ఇంగ్లాండులో ప్రధాని స్వంతానికి ఇల్లు కట్టుకోవడాన్ని, ముఖ్యంగా ప్రజల సొమ్ముతో కట్టుకోవడాన్ని అక్కడి ప్రజలు హర్షించరు. భారతదేశంలో పన్నులు కట్టేవాళ్ళంతా నిస్సహాయులు!

అసలు ఇటువంటి చిక్కులు తలెత్తడానికి బాధ్యులు లాలా గుల్జారీలాల్ నందాగారు. ఆయనే నెహ్రూగారు వసించిన తీన్‌మూర్తి భవనాన్ని నెహ్రూ మ్యూజియంగా మార్చేశారు. అప్పటి ఆర్థికమంత్రి టి. టి. కృష్ణమాచారిగారు దానిని ఖండించారు. మరో ఆఫీసరుగారి పుణ్యమా అంటూ, పదవనంబరు జనపథం ప్రధాని నివాసగృహం అయింది. అందులో లాల్ బహదూర్‌శాస్త్రిగారు కొద్దికాలం మాత్రమే ఉన్నారు. జ్యోతిష్కుల్ని శిరసావహించిన ఆయన వారసురాలు అక్కడ మకాం పెట్టడానికి జంకారు. ఆమె పితృపాదులు నివసించిన తీన్‌మూర్తి భవనంమీద కొంతకాలం తర్కం జరిగింది. తర్వాత అది కంతశోష అని తేలిపోయింది. హైదరాబాదు హౌస్‌లో వుండడానికి గాని, ప్రధానికోసం మరో భవనాన్ని నిర్మించడానికిగాని ఆమె ఒక స్థిరమైన అభిప్రాయాన్ని చెప్పడంలేదు. ఆమె మనస్సు అటూ యిటూ వూగుతోంది. ఇదలావుంచి, పదోనంబరు జనపథంమీద అక్షరాలా లక్షలకొద్దీ ధనం వెచ్చించబడింది. ఇప్పుడది ఖాళీగా వుండిపోయింది. అది రక్షణమంత్రిగారికి ఏర్పాటుచేశారు. ఆయన అందులో కాలు పెట్టలేదు శ్రీమతి లలితాశాస్త్రి ఆమె భర్తగారి జయంతి ఉత్సవాన్ని అందులో ఘనంగా జరిపించారు. ఆమె అలా ఎలా చేయగల్గారు? అని అడిగే నాధుడు లేడు. శ్రీమతి గాంధీగారు ఇప్పుడు కాకపోతే రేపు ఏదో ఒక గృహంలో నివాసం ఏర్పాటుచేసుకోక తప్పదు. ఆమెకి ఇద్దరు పుత్రులున్నారు. వీరు ఆ యింటిమీద తమకి అధికారం వుందని ఎప్పుడో ఒకప్పుడు అనడానికి, అడగడానికి ఆస్కారంలేకపోలేదు!

భారతదేశం మహాత్మాగాంధీగారి పుట్టిన రోజు వేడుకల్ని జరుపుకుంటున్నది. మహాత్ముడు భారతదేశాన్ని పేదదేశంగా పేర్కొన్నారు. కొన్ని కోట్లరూపాయలు నెహ్రూగారిమీద, నెహ్రూ సమాధిమీద, అశోకా హోటల్‌దగ్గరి నెహ్రూపార్కుమీద, శాస్త్రిగారి సమాధిమీద ఖర్చుపెడుతున్నారు. మరి, పేదదేశం చేయవలసిన పనేనా యిది?

జమునానది కుడివైపు ఒడ్డున గాంధీగారి సమాధినుంచి రైల్వే బ్రిడ్జివరకు వనాలను, పార్కుల్ని నిర్మించాలనిచూస్తున్నారు. ఢిల్లీని పునర్నిర్మించాలని కోరుకొనే అధికారవర్గం, ఆ నదికి ఎడమవైపు అభివృద్ధి చేస్తే భవిష్యత్ ప్రధానుల దహన సంస్కారానికి చాలా ఉపయోగంగా వుండివుండేది!

భూస్వామ్యంమీద యుద్ధంలాంటి తిరుగుబాటు పూర్వంనుంచీ వున్నదే. అప్పటినుంచి కాంగ్రెసు అధికారంలోకి వచ్చింది. ఆ కాంగ్రెసు వారిలో నుంచి కొన్ని 'రాజవంశాలు' ఉద్భవించాయి. నెహ్రూవంశం, లాల్ బహదూర్‌శాస్త్రి వంశం, రాజేంద్రప్రసాద్

ంశం, శుక్లా వంశం, పంత్ వంశం — ఇలా ఎన్నయినా చెప్పుకుపోవచ్చు. అందులో నెహ్రూ వంశం, పంత్ వంశం, శుక్లా వంశం - ఈ మూడూ ఇప్పుడు కేంద్ర మంత్రివర్గంలో చోటు చేసుకున్నాయి మహాత్మాగాంధీగారిని 'జాతిపిత' అన్నారు ఆయన పిల్లల గురించిన కష్టసుఖాలిని ఆలోచించే వారు లేరు! మరో భారీ విగ్రహం శ్రీ సి. రాజగోపాలాచారిగారిది. తన పిల్లల బాగోగులు చూడని వారిలో ఈయన రెండవ వారు. తక్కిన వాళ్ళు కూడా ఇలాంటి నిరాదరణతోనే పరుగుతీశారు. ఒక విధంగా ఉపప్రధానిని మెచ్చుకోవాలి. ప్రపంచ పర్యటనకి వెళ్తూ ఆయన కుమారుడు కాంతి భాయ్ దేశాయ్‌ని కూడా తీసుకువెళ్ళారు!

**సమావేశాలు కాలక్షేపానికా ?**
**సమస్యా పరిష్కారానికా ?**

రెండువారాల క్రితం మరో నిరర్థకమైన వ్యాయామం జరిగింది. ఆహార మంత్రుల సమావేశం తెరతొలగించుదామని, ఒక పక్షం రోజుల వరకు వార్తాపత్రికలు నిర్ణీతకాలాన్ని దాటి పని చేశాయి. ఆహార వ్యవసాయ మంత్రి తోడురాగా, ప్రధాని ఈ సమావేశాన్ని ఆవిష్కరించారు. అక్కడ జాతీయ పతాకం ఎగరవేయడాన్ని మినహాయించి, తక్కిన అట్టహాసమంతా ఘనంగా జరిగింది. మధ్యమధ్యలో ఫోటోగ్రాఫర్లు, టెలివిజన్ రచయితలు రంగం మీద పెరేడ్ చేశారు. ఆవిష్కరణ మహోత్సవ తతంగమంతా పూర్తయేసరికి మధ్యాహ్నం ఒంటి గంటయిపోయింది. భారతదేశంలో జాతీయ ఆహార విధానాన్ని నెలకొల్పడానికి అక్కడ గొప్ప గొప్ప భోజనాలు, విందులు, టీపార్టీలు ఏర్పాటు చేసుకుని సమావేశాన్ని ముగించేశారు!

ఇదివరకు టి. సేన్‌గారు జాతీయ విద్యా విధానమనే పేరుతో జరిపిన సమావేశం ఎటువంటి సత్ఫలితాల నిచ్చిందో మనకు తెలుసు. ఈ సమావేశం అంతకంటే ఎక్కువ చేయదు. సమావేశంలో పెద్ద సమస్యలనేమీ చర్చించకుండానే, ఆహార మంత్రి బాబూ జగ్జీవన్‌రామ్‌గారు బ్రేవ్ మని త్రేన్చి సంతృప్తి పడ్డారు. పుష్కలంగా వున్న రాష్ట్రాల నుంచి ధాన్యాలను తీసుకోడానికిగాని, లోటు రాష్ట్రాల పరిస్థితిని అర్థం చేసుకోవడం గాని ఏమీ జరగలేదు. పాలం విమానాశ్రయం. ఆ ప్రాంతంలోనే కేంద్రప్రభుత్వం అధికారం నియమితమై పోయిందని తెలిసిపోయింది. భారతదేశంలో హెచ్చు, తగ్గు రాష్ట్రాలను సరిచేయలేని శ్రీమతి గాంధీ ప్రభుత్వం అశక్తత వ్యక్తమయింది. మిగులు రాష్ట్రాలని, లోటు రాష్ట్రాలని వారి మానాన వారిని విడిచిపెట్టి మీరు మీరు చూసుకోండి అన్నది ప్రభుత్వం. 'ప్రొక్యూర్‌మెంట్' గురించిన ఒక స్థిర నిశ్చయం ఏదీ తీసుకోబడలేదు. డెబ్బయ్ లక్షల టన్నుల ధాన్యం అసలు కావలసి వుంది. అందులో నలభయ్యెనిమిది లక్షలు మాత్రమే అతికష్టం సాధ్యంగా సంపాయించ గలుగుతామని రాష్ట్ర ముఖ్యమంత్రులు తెలియపరిచారు. క్రిందటి సంవత్సరం ఇరవైతొమ్మిది లక్షల టన్నుల దాళవా పంట సంపాయించాము. వ్యవసాయ ధరల సంఘం సూచించిన ధరలు చాలా తక్కువగా ఉన్నాయని అన్ని రాష్ట్రాలవారూ అన్నారు. కాని, కొత్తధరలు ఎలా వుండాలో ఇంకా నిర్ణయం కాలేదు.

దిగుమతి చేసుకున్న ధాన్యాల నుంచి 'సహాయం' మానివేయాలని సమావేశంలో చర్చ జరిగింది. దానిమీద, నంబూద్రిపాద్‌గారు తమ కేరళ నష్టపోతుందని ఆక్షేపణ తెలియపరిచారు. పేదప్రజలకు దెబ్బ అంటూ ఆహారమంత్రి విమర్శించారు. సహాయాన్ని తీసివేయాలి కాని, దాని మీద వచ్చిన డబ్బుని లోటు రాష్ట్రాలకివ్వాలి అంటూ యమ్. యల్. సుఖాడియాగారు, చరణ్‌సింగ్‌గారు వాదించారు. ఆ డబ్బును ఆయారాష్ట్రాలు ఇష్టం వచ్చినట్టు వినియోగించుకుంటాయి అన్నారు వారిద్దరూ!



భారతదేశానికి స్వాతంత్ర్యాన్నిచ్చిన మాజీ బ్రిటిష్ ప్రభుత్వప్రధాని శ్రీ అట్లీ ఈనెల 8 తేదీన మరణించారు.

రాష్ట్రాలు కేంద్రానికి ఇచ్చిన ధాన్యాలు అంతటిమీదా బోనస్ చెల్లించాలని ఆంధ్రప్రదేశ్, పంజాబ్, మధ్యప్రదేశ్, హర్యానాలు కోరాయి ఇప్పుడు కొంతవరకు మాత్రమే ఈ బోనస్ ఇస్తున్నారు. లోటు రాష్ట్రానికి కూడా బోనస్ పద్ధతిని అనువర్తింపజేయాలని అజయ్ ముఖర్జీగారు పట్టుపట్టారు!

పెద్ద ఎత్తున ధాన్యాలని పంపించడానికి, సరఫరా చేయడానికి రాష్ట్రాలకి కేంద్రం ధన రూపేణా సహాయం చేయగలదని బాబూ జగ్జీవన్‌రామ్‌గారు పత్రికా విలేఖరులకు తెలియచెప్పారు. సరఫరా చేసే ధాన్యాలకి సరయిన ధరలు నిర్ణయం కావడానికి ముందు ఒక్కో రాష్ట్రంతోను సంప్రతింపులు జరుపుతామన్నారు.

ఈ ప్రకటనకి కేరళ ముఖ్యమంత్రి నంబూద్రిపాద్‌గారు అనహనం కనబరిచారు. ముఖ్యమంత్రుల సమావేశం వల్ల తెలిందేమిటయ్యా అంటే — 'కొనుగోలుదారుకు అధిక ధరలు. లోటు రాష్ట్రాలకి తక్కువ సరఫరా!' రాష్ట్రాల మధ్య పంపిణీలు రాష్ట్రాలకే విడిచిపెడితే అనేక నష్టాలు ఉన్నాయని నంబూద్రిపాద్ అన్నారు. రాష్ట్రాలకి స్వతంత్ర మిచ్చినట్లయితే పెద్ద రయితులు బాగుపడతారు పేద రయితులు బాధపడతారు. అన్నారు. దేశమంతా ఒకటే ఒక్క 'ఆహార మండలం' కాకపోతే జాతీయ ఆహార విధానమన్న దానికి అర్థం లేదన్నారు. ఇప్పుడు మనదేశంలో మూడు మండలాల కార్యకలాపాలూ చూస్తూనే వున్నాం. వాటి వల్ల ప్రయోజనమేమీ కనిపించడంలేదు. సంపాదన — పంపకాలు రెండూ పెద్ద రయితు మిగులుమీద ఆధారపడి జరగాలనే అభిప్రాయాన్ని నంబూద్రిపాద్ వెల్లడించారు. ఇదీ మన జాతీయ ఆహార విధానం పరిస్థితి!

# మూన్ రేకర్ -3.

## జేమ్స్‌బాండ్ బొమ్మల సీరియల్










లండన్ రక్షణకోసం ఖండాంతర పరమాణు చోదితాస్త్రం కట్టి ఇస్తానని హ్యూగో డ్రాక్స్ అన్నాడు. ఈ ఆశ్చర్యకరమైన దానికి దేశం అంగీకరించింది.

'ధైర్యశాలి' డ్రాక్స్‌కి 'సర్' బిరుదు....

సర్ హ్యూగో డ్రాక్స్ పలుకుబడి మంచిస్థాయిలో ఉన్నప్పుడు మా రహస్య రక్షణదళం శాఖ అధిపతి నన్ను పిలిపించాడు.










''జేమ్స్ ఈ హ్యూగో డ్రాక్స్ సంగతేమిటో కొంచెం కనుక్కో........''

''అదేమిటిసార్! రాకెట్‌లో లోపం ఏదీ లేదు కదా!''

''మూన్‌రేకర్‌తోనేనా? నాకు తెలిసినంతదాకా లేదు. డ్రాక్స్‌సంగతే మనం కనుక్కోవాలి. అతను నీకు తెలుసా?''

''పరిచయం లేదు కాని బాగా డబ్బున్నవాడని. ఎంతోపేరు సంపాదించుకున్నాడని తెలుసు—''

''కాని చిట్ట పేకాటలో మోసం చేస్తాడు.''










''డ్రాక్స్‌లాంటి కోటీశ్వరుడికి మోసం చెయ్యవలసిన అవసరం ఏమిటి?''

''అది నువ్వే కనుక్కోవాలి జేమ్స్''

బ్లేడ్స్ ఒక ప్రత్యేకమైన ధనికుల పేకాట క్లబ్బు. డ్రాక్స్ అక్కడ బ్రిడ్జి ఆడుతూ ఉంటాడు.

నేను అక్కడ 'విషయం తెలుసుకునేందుకు' కావలసిన ఏర్పాట్లు చేశారు.

JAMES BOND
by IAN FLEMING
Drawing by John McLusky

RULES OF BLADE'S CLUB

RULE 23: Every member must be able to prove he is worth £100,000 in cash.

RULE 24: Every member must win or lose £500 a year at cards on the club premises







బ్లేడ్స్ క్లబ్బు నిబంధనలు రూల్ 23: ప్రతి మెంబరుకీ లక్ష పవున్ల రొక్కం ఉన్నట్లు రుజువు కావాలి.

రూల్ 24: ప్రతి మెంబరూ ఒక సంవత్సరంలో క్లబ్బు ఆవరణలో 500 పవున్లు గెలవాలి, లేదా ఓడి పోవాలి.

బ్లేడ్స్‌లో సర్ హ్యూగో డ్రాక్స్‌ని 'ఇన్‌స్పెక్ట్' చెయ్యటానికి నన్ను పంపారు— ప్రపంచంలో కెల్లా ధనికులలో ఒకడు అతను.

భోజనానంతరం పేకాట గదిలో కూర్చుని ఉండటం చూశాను.










నెమ్మదిగా లోపలికి పోయాను. బ్లేడ్స్‌లో హ్యూగో డ్రాక్స్ బ్రిడ్జి ఆటని పరిశీలించమని నాకు ఆర్డర్లు ఇచ్చారు.

ఆడినంతసేపూ పొగ తాగటం గమనించాను.

(కాని సిగరెట్లని పెట్టెలో నుంచి తీశాడు, ఇక బల్లమీద సిగరెట్ కేస్ ఎందుకు?)










(అదన్నమాట కిటుకు! ముక్కలు పంచేటప్పుడు సిగరెట్‌కేస్ మీద ప్రతిబింబం చూస్తాడు! క్లబ్ అధ్యక్షుడితో చెప్పాలి....)

“లార్డ్ బేసిల్డన్, సర్ హ్యూగో డ్రాక్స్ పేకాటలో ఎలా మోసం చేస్తున్నాడో మాత్రం చెప్పగలను.”

“అంతేనా నువ్వు చెయ్యగలిగింది?”

“సరే, కావలిస్తే ఇంకా ఎక్కువే.....”

(ఇంకా ఉంది)

# ఆంగ్లపత్రికలు

('అఖిలభారత దేశ పత్రికలు'గా పేరు పొందిన ఆంగ్ల పత్రికల వ్యాఖ్యలలో భాగాలు కొన్ని తరచు (అనువదించి) ప్రచురించదలచాము. ప్రాంతీయ పత్రికల వ్యాఖ్యలలోని భాగాలు కూడా అప్పుడప్పుడు ప్రచురిస్తూ ఉంటాము. కలకత్తాలో శ్రీ నందా చేసిన రాయబారం, యాత్రకి సంబంధించిన వాటిని ఈ వారం వేస్తున్నాము.)

సెప్టెంబరు 28న "టైమ్స్ ఆఫ్ ఇండియా 'క్లెన్సీ' అనే శీర్షిక ఇట్లా వ్యాఖ్యానించింది:

"…. దుందుడుకుగనూ, మోటుగానూ ఈ వ్యవహారాన్ని పరిశీలించారనడానికి సందేహంలేదు. వారు (శ్రీ నందా ) చేసిన నిర్ణయంలోని సమంజసత్వాన్ని ప్రశ్నించడానికి ఇలా అనడం లేదు. నాయకత్వంలో మార్పు తీసుకురాకుండనే ఆ రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీని చక్కదిద్దాలని యత్నించడం వృథా ప్రయాస అవుతుంది. అయితే మరికొన్ని కొత్త చీలికలకు దోహదపడని పద్ధతిలో యీమార్పు తీసుకు రావలసి ఉంటుంది…"

"ఇండియన్ ఎక్స్‌ప్రెస్" 26—9—67 (బిలేటెడ్ బట్ గుడ్):

"పశ్చిమబెంగాల్ ప్రదేశ్‌కాంగ్రెసును రద్దు చేసి దానికి బదులు కద్దిమంది సభ్యులుండే చిన్న తాత్కాలిక కార్యనిర్వహణ సంఘాన్ని యేర్పాటు చేయడం— ఆలస్యంగా జరుగుతున్నప్పటికీ చాలా ధైర్యంతో కూడినట్టి పని. పశ్చిమబెంగాల్ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా వున్నప్పుడు శ్రీ అజయ్ ముఖర్జీ కోరివున్నది కూడా సరిగ్గా యీ యేర్పాటునే."

"హిందూ" : 26—9—67) "స్టార్ట్ ఆఫ్ క్లీన్ అప్ ):

శ్రీ అతుల్యఘోష్ నాయకత్వం వహిస్తున్న వర్గం పెత్తనంలో పశ్చిమబెంగాల్ కాంగ్రెసు కార్యకలాపాల నిర్వహణ తీరు ఆ రాష్ట్రంలోని కాంగ్రెసు వాదులకు చాలా అసంతృప్తి కలిగించినదన్న నమ్మకం ఆ రాష్ట్రంలోని కాంగ్రెసువాదులతో సంప్రతింపులు జరిపిన తరువాత తనకు కలిగిన ఫలితంగానే శ్రీ నందా యీ నిర్ణయానికి వచ్చినట్లు తోస్తుంది. పార్టీ నాయకత్వాన్ని మార్చడం ద్వారా మాత్రమే తగాదాలను పరిష్కరించడానికీ, ఇంతకు ముందు సంస్థ నుంచి వేరే పోయినవారు తిరిగి సంస్థలోకి వచ్చేట్లు చేయడానికి దోహదమేర్పడ తుందనే అభిప్రాయం కూడా ఎక్కువ మందికి ఉన్నది….

"ఈ చర్య పర్యవసానంగా అధికారాన్ని కోల్పోయే వారు మరొక కొత్త వర్గంగా రూపొందితే అది దురదృష్టమే కాగలదు.."

"డెక్కన్ హెరాల్డ్" 26—9—67 ("నందాస్ కూప్ )

"పశ్చిమబెంగాల్‌లోని రాజకీయ పరిస్థితుల దృష్ట్యా, ఆరాష్ట్ర కాంగ్రెసు విషయమై శ్రీ నందా చేసిన నిర్ణయం ప్రాముఖ్యం వహిస్తున్నది. శ్రీ అతుల్యఘోష్ మీద దెబ్బ తియ్యడం లేదా వారి ధాష్టీకానికి కళ్ళు తోడడమే ప్రదేశ్‌కాంగ్రెస్ కమిటీ రద్దు చెయ్యడంలోని ఉద్దేశమైతే, మరి కాంగ్రెస్ కార్యవర్గంలో సభ్యుడుగ, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ కోశాధికారిగా వారు ఉండడంలోని సబబు మిటో వివరించవలసి వుంటుంది."

"స్టేట్స్‌మన్ 26—9—67: ("ఎ ఫస్ట్ స్టెప్ ):

"పశ్చిమబెంగాల్ కాంగ్రెస్ కమిటీ స్వరూప స్వభావాలు పూర్తిగా మారితేగాని ఆరాష్ట్ర ప్రజలకు సంతృప్తి కలగదు. ఆ రాష్ట్రంలో కాంగ్రెస్ బొమ్మ రూపురేఖలు మెరుగు పడవు. తదనుగుణమయిన పరిస్థితులకు దోహదపడగల తాత్కాలిక కార్యనిర్వహణ సంఘాన్ని నియమించితే తప్ప— లేని పక్షంలో శ్రీ నందా, అతుల్యఘోష్‌ల తగాదాలలో ఇది మరొక అధ్యాయమన్న అభిప్రాయం కలుగుతుంది

—అవధాని



ఇలాగో నువ్విధథంగా చీర కట్టుకోవడం చూశారంటే, నీ కొంగును చింపి. నేను చొక్కా కుట్టుకున్నానని అనుకోరూ?? జనం??

# నిరుత్సాహము బద్ధకముగానా ?
# అజీర్ణమువల్ల కావచ్చు.

మీ జీర్ణశక్తిపోతే మనస్సు సుస్థిరంగా ఉంచుకోలేరు. విసుగు చెందుతూ ఉంటారు. విశ్రాంతిలేకుండా ఇంటి పనులన్నీ చక్కబెట్టుకోవలసిన ఇల్లాళ్లు అజీర్ణంవల్ల బాధపడలేరు. హ్యూలెట్స్ మిక్స్చర్ వాడండి. అమోఘంగా పనిచేస్తుంది. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధకలిగించే ఆమ్లరసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరిస్తుంది.

హ్యూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకుకూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిపిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి. హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.






C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
86/A నయినియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-2.

HWT/CH/898.

## హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును

# ఆళందిలో పుణ్యక్షేత్రం

'ఆ మహారాష్ట్ర బ్రాహ్మణ యాత్రికుడూ, భార్య ఆత్మహత్య చేసుకున్నారు!' యమునా నదీ తీరం మీద ఎందరో ఇలా అనుకున్నారు. అది ఏడు శతాబ్దాల కింది మాట. ప్రయాగలో గుమిగూడిన వారెవరికీ ఆ జంట ఆత్మహత్యకి కారణమేమిటో తెలియలేదు. అక్కడ ఉన్న కొద్దిరోజుల్లోనే వారిద్దరూ అందరి అభిమానానికీ పాత్రులయ్యారు. వారి శవాలు నీటిమీద తేలి కనిపించటంతో అందరూ ఎంతో ఆశ్చర్య విచారాలకి లోనయ్యారు. భర్తపేరు విఠల్ పంత్, భార్యపేరు రఖ మా బా యి. పయిఠాన్ ప్రాంతంలో ఉన్న ఆపేగావ్ గ్రామం నుంచి ప్రయాగకి వచ్చారు. విఠల్ పంత్‌కి చిన్నప్పటి నుంచీ దైవభక్తి మెండు. తీర్థయాత్రలు చేస్తూ ఆళందీ అనే చోటుకి వెళ్ళాడు. అక్కడ సిధోపంత్ అనే బ్రాహ్మణుడు కలిసి తన అల్లుడుగా చేసుకుంటానన్నాడు, విఠల్‌పంత్‌ని. ముందు అభ్యంతరం చెప్పినా విఠల్‌పంత్‌కి కలలో దేవుడు కనిపించి ఈ పెళ్ళి చేసుకోమని చెప్పటంతో అతను చివరికి అంగీకరించాడు. కొన్ని సంవత్సరాలపాటు ఆపెగావ్‌లో ఉండి ఒకనాడు భార్యాసమేతంగా కాశీయాత్ర మీద వెళ్ళాడు. అక్కడ రామానందస్వామి అనే సన్యాసి శిష్యుడయ్యాడు. సన్యాసం కూడా పుచ్చుకున్నాడు. కాని, సిధోపంత్‌కి ఈ సంగతి తెలిసి కాశీకి వెళ్ళి అల్లుడిని ఇంటికి తీసుకు వచ్చేశాడు. అంతేకాక, మళ్ళీ గృహస్థుడిగా మార్చేశాడు. ఆ తర్వాత విఠల్ పంత్‌కి నలుగురు పిల్లలు కూడా కలిగారు. అయితే, సన్యాసి తిరిగి గృహస్థుడు కావటం సంఘానికి నచ్చలేదు. ఎందరో అతన్ని సూటిపోటు మాటలనటం ప్రారంభించారు. చివరికి బ్రాహ్మణులంతా చేరి అతన్ని వెలి వేశారు. అతని కొడుకు వ్రత బంధం కాకుండా అడ్డుపెట్టారు. తమవల్ల తమ సంతానానికి కష్టం రాకూడదనుకుని విఠల్‌పంత్, రఖమాబాయిలు ఇద్దరూ ప్రయాగకి వెళ్ళి ప్రాణాలు వదులుకున్నారు. అప్పటికీ ఊరి పెద్దల గుండెలు మెత్తబడలేదు. అతని కొడుకులయిన జ్ఞానేశ్వర్, సోపాన్‌ల ఉపనయనాలని జరగనివ్వలేదు. వారు బ్రాహ్మణ కులానికి అతిముఖ్యమయిన ఈ ధర్మాలని పాటించాలని ఎంతో ఉబలాటపడ్డారు.

ఒకనాడు జ్ఞానేశ్వర్ తన దివ్యశక్తి ప్రదర్శన ఒకటి చెయ్యటంతో పద్యేళ్ళలోపు వయస్సుగల ఇద్దరు బాలుర ఉపనయనాలకీ అంగీకరించారు. విఠల్‌పంత్ రఖమాబాయిల పిల్లలు నలుగురికీ వారి తలిదండ్రుల వద్ద నుంచి భక్తి బాగా అబ్బింది. జ్ఞానేశ్వర్, సోపాన్, నివృత్తి, ముక్తాబాయి—నలుగురూ భక్తి ఉట్టిపడే పాటలు ఎన్నో రాశారు. కాని, జ్ఞానేశ్వర్ రచనలే జగత్ ప్రసిద్ధికెక్కాయి. జ్ఞానేశ్వర్ తన 15వ ఏటే 'జ్ఞానేశ్వరి' అనే గ్రంథం రాశాడు. ఇది భగవద్గీత మీద వ్యాఖ్య. ఇది మరాఠీ సాహిత్యానికి శంఖుస్థాపన వంటిదని అందరూ అనుకుంటారు. దేశభాషలలో 'గీత' మీద ఇంతకన్నా గొప్ప వ్యాఖ్య లేదనుకుంటారు.

జ్ఞానేశ్వర్ తన 28వ ఏట పూనాకి 20మయిళ్ళ దూరంలో ఉన్న 'ఆళందీ'లో సమాధిలోకి వెళ్ళిపోయాడు. ఈయన సమాధిని ఏక్‌నాథ్, తుకారామ్, నామదేవ్ — అందరూ సందర్శించారు. అది గొప్ప పుణ్యక్షేత్రం.

—ఎస్

## వార్తలలో వనిత

'మధ్యప్రదేశ్ మంత్రివర్గంలో ఏ ఒక్క రాజకీయవర్గం వారిదీ పయి చెయ్యి కాదు, అంతా సవ్యంగా నడుస్తున్న'దన్నారు ఇటీవల మద్రాసులో రాజమాత విజయ రాజే సింధియా.



శ్రీ మిశ్రా ప్రభుత్వాన్ని పడగొట్టటానికి మూలకారకురాలు ఈమెయే కాబట్టి ఈ విషయాలమీద మాట్లాడేందుకు ఆమెకి 'అధికారం' ఉందన్నా పరవాలేదు. తన అనుచరులకి తగినన్ని టిక్కెట్లు ఇవ్వలేదనే ఈమె కాంగ్రెసుని వదిలి వెళ్ళిపోయింది. అప్పటికీ శ్రీ మిశ్రా కాంగ్రెసు పక్షానికి మెజారిటీ రావటంతో రాజమాత ఇతర పద్ధతులని అనుసరించి కాంగ్రెసు ప్రభుత్వాన్ని తొలగించటానికి ప్రయత్నించి నెగ్గగలిగింది. అంతా బహిరంగంగానే జరుగుతున్నది కాబట్టి రాజమాతది తెర వెనుక నాటకం అనటానికి వీల్లేదు. అంచగొండితనం నిర్మూలించటానికి కొత్త ప్రభుత్వం ప్రత్యేకంగా తోడ్పడుతున్నట్లు ఆమె ప్రకటించారు. మధ్యప్రదేశ్ ఓవర్‌డ్రాఫ్ట్‌ని 18 కోట్లనుంచి 3 కోట్లకి తగ్గించారట.

రాజ్యభరణాలు రద్దు చెయ్యటం రాజ్యాంగానికి విరుద్ధం అని రాజమాత అనటంలో ఆశ్చర్యంలేదు. ఈమె కుమార్తెలు ఇద్దరు కొడయికొనాల్‌లో కాన్వెంటులో చదువుకుంటున్నారు. రాజమాత పుట్టినది ఉత్తరప్రదేశ్‌లో. తల్లి నేపాళీ వనిత. రాజమాత వారణాసిలో బి. ఏ. చదువుతూ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనటానికి మాని వేసిందిట. మొత్తం పిల్లలు అయిదుగురు.

—తస్కర్




**ఇ. బి. దుగ్గిరాల**

లక్నో లోకానికి చెవులున్నాయి, కళ్లు లేవు. సంతోషాన్ని భరించలేక పాడుచేస్తుంది

లోకం ఎలాగ బదిరాంధం అయ్యిందేమో. కళ్లుఉండీ చూడదు. చెవులుండీ వినదు. న్యాయం చెప్పకల్గి చెప్పదు. అలాంటిది సంతోషాన్ని ఎలా పాడు చేస్తుంది?— అలా పాడు చేసేవాళ్లు తోటివాళ్లే!

**కుమారి కె. బి. తెనాలి**

ఒక సామాన్య స్త్రీ ఆదర్శ జీవితం గడపాలంటే ఆమె దైనందిన జీవితంలో ఎలా ప్రవర్తించాలి?

ఏ సినిమాలోని సామాన్య స్త్రీ గురించి సోదరి నువ్వు అడుగుతున్నది ?

**జి. ఎస్. ఆర్, జంపని**

చదువులేని వాళ్లు కథలు వ్రాయడం ఏమిటని ఎగతాళి చేస్తారు. నాకు చాలా నిరుత్సాహంగా ఉంది.

ఉద్యోగార్హతల కోసం చదివే ఆ చదువుకీ కళా రంగానికీ సంబంధం లేదు సోదరా, చదువులేని వాళ్లంటూ ఈ రంగంలో ఎవరూ ఉండరు.

**జె. ఆర్, బరంపురం**

నేటి స్త్రీలలో కొంతమంది మన భారత దేశంయొక్క సాంప్రదాయాన్ని పాటించక పాశ్చాత్య దేశాల ఫాషన్లు అలవరచు కొంటు న్నారు. ఎందుచేతనండి ?

మన ప్రాచీన భారత నాగరికత ఈనాడు అమలులో పెట్టడం కష్టం కనుక!

**ఐ. హెచ్. బి, భువనేశ్వర్**

అతిగా నమ్మిన స్నేహితుడే తోటి స్నేహితుణ్ణి ద్రోహం చేస్తూఉంటే చూస్తూ ఊరుకోమంటారా ?

అతిగా ఎవరు నమ్ముతున్నారు మీ స్నేహితుణ్ణి ?

**పి. ఎస్. కె. ఆర్, ఒంగోలు**

'ధైర్యే సాహసే లక్ష్మి' అంటారు. 'సాహసవిధాతా న క్రియాం' అంటారు. ఎప్పుడు దేనిని అనుసరించాలి ?

'కీలెరిగివాత' అన్నదానికే పై వి కూడా వర్తింప చేయాలి. సందర్భాన్ని పట్టి, బుద్ధి నుపయోగించి సాగిపోవాలి.

**ఎస్. వి. సి.**

'మనం చేస్తున్నది మంచిపని అనితెలుస్తే, అది అందరి దృష్టిలోనూ మంచిగావే ఉన్న ప్పుడు సంఘాన్ని ఎదిర్చినా తప్పు లేదంటే విందు...

మీ మాటే ఇంకా గట్టి నమ్మకం కుదరలేదేమో అనుకో. అది గుర్తించండి?

**సి. పి. ఆర్. బి, విశాఖపట్నం**

పక్కింటి ఆడదాన్ని చూడగానే వదిన గారూ అని పలకరించే మన స్త్రీల భయాన్ని చూసి ఏమనుకోవాలి రామలక్ష్మి గారూ !

భయం కాదని రాంబాబుగారూ, ముందు జాగ్రత్త! మన బంగారం మంచిదా? కాదా? అని ఎక్కడ పెట్టుకోవాలో తెలిసిన స్త్రీ, ఎదుటి స్త్రీని ఆత్మీయు రాలుగా చేసుకుంటుంది. (మాటలో మన మాట— 'అక్కయ్యగారూ బావగారున్నారా?' అని అడిగి తేరవగానే 'ఒదినగారు ఆబద్ధం చెప్తున్నార'ని ఫిర్యాదులు వినిరే మగవారి మాట అడిగారం?)

**ఎ. జి. బి, అనంతపురం**

ఈ మధ్య మీ ముచ్చటైన జంట పార్వతీ కృష్ణ మూర్తిగార్ల దర్శనమే కరవై పోతూందేమిటండీ ?

ఆడపా తడపా కనబడుతూంటేనే కదా ముచ్చటగా ఉంటుంది.? మళ్లీ కనిపించి మిమ్మల్ని చూడ మంటాము లెండి!

**వి. వి, ఆత్మకూరు**

స్త్రీ పురుషుల వివాహ జీవితంలో చదువుకు సంసారానికి పొత్తు కుదరదంటా రెందుకు ?

రెండూ ఏకాగ్రత కోరే రంగాలే కావడం అందుకు కారణం సోదరీ.

**బి. ఎల్, బరంపురం**

భార్యాభర్తలు తోడు నీడ అంటారుకదా ఎవరు తోడు ? ఎవరు నీడ ?

అది భార్యాభర్తల మధ్య ఉండే పరమ రహస్యం.

**సి. ఎస్. ఎస్, చిత్తరంజన్**

రచయిత ఆదివిష్ణుగారి చిరునామా తెలుపకలరా ?

ఉత్తరం కేరాఫ్ ఆంధ్రపత్రిక అని వ్రాయండి. వారికే పంపుతారు.

**సి. ఎస్. ఎల్, సామర్లకోట**

మానవుడు మతాన్ని ఎందుకు స్వీకరి స్తాడు ? నిష్కృతి మార్గమనా ? తన మీద నమ్మకంలేకనా ?

మానవ ప్రయత్న విజయాలకి, వైఫల్యాలకి స్వశక్తికి మించినదేదో ఉండాలన్న నమ్మకంతో కూడా కావచ్చును.

**వి. వి. ఎస్, కరీంనగర్**

కళాశాలలో బోధనా భాషగా ప్రాంతీయ భాషలను ప్రవేశపెట్టితే భారతదేశం ఐక్యరాజ్యసమితిగా మారినా మారవచ్చునా ?

టవర్ ఆఫ్ బాబిలోగా మారవచ్చు. ఐక్యరాజ్య సమితిగా రూపొందించడానికి కూడా కొంత క్రమ బద్ధమైన పద్ధతి కావాలి కదా!

**పి. ఎ. ఎల్, విజయలక్ష్మి**

విమర్శవల్ల మానవుడు కృంగిపోతాడని నేను, లేదని నాచెల్లెలు వాదించుకున్నాం. ఎవరు రైటు ?

సహృదయతతో కూడిన నిశిత విమర్శ మానవ ఉన్నతికి దోహదకారి. కాని విమర్శవల్ల ప్రయో జనం శూన్యం.

**టి. ఆర్, విజయనగరం**

ప్రాణ స్నేహం చేశాం. ఇప్పుడు విడిపోయాం ఎలాఉండడం చెప్పండి ?

ప్రాణ స్నేహితులు విడిపోయినట్టు. స్నేహంలో వ్యక్తిత్వాన్ని గౌరవించడం మరిచిపోతే వచ్చే చిక్కే యిది.

**పి. వి. ఆర్, విశాఖపట్నం**

నేడు మనదేశం ఎదుర్కొంటున్న ఆహార ఆర్థిక విద్యాసమస్యలపై మీ సలహా ఏమిటి?

దీనికి సలహా ఎందుకు? ఆర్థికమైన లోటు అప్పులు భర్తీ చేస్తున్నాయి. ఆహారపు అవసరాలు దిగుమతులు నెరవేరుస్తున్నాయి. ఇక విద్యా రంగం కుక్కలు చింపిన విస్తరిగా తయారైంది. దీనిని గురించి సామాన్యులేం చేయగలరు?

**ఎ. ఎస్. యు, ఉరవకొండ**

ఆడది కొంచెం పరిచయం ఉన్న వ్యక్తులతో చనువుగా మాట్లాడితే నీచముగా భావి స్తారు ఎందుకు ? వారికి బుద్ధి చెప్పడం సాధ్యమా ?

పరిచయం ఉన్న వ్యక్తితో మాట్లాడినంత మాత్రాన నీచంగా తలపోసేవారిని మనం గుర్తించ డమే తప్పు. ఇక అటువంటి వారిని మార్చడం అన్నది— కుక్కతోక సాపు చేయడానికి పడే తాప త్రయం లాంటిదే.

# వ్యాసరచన పోటీలో బహుమతిపొందిన రచయిత్రులు—వివరాలు

మొదటి బహుమతి



**మామిడి అనంతలక్ష్మి**

వరంగల్ జిల్లాలోని శాయం పేటలో 1937 సంవత్సరములో జననం. ఆ గ్రామములోనే ఐదవ తరగతి వరకు విద్యాభ్యాసం. వివాహం 1950 లో జరిగింది. సంతానం నలుగురు కుమారులు. భర్త శ్రీ రమాకాంతరావుగారు జర్నలిస్టు, రచయిత,కవి. ప్రస్తుత నివాసం హైద్రాబాదు.

వరంగల్ నుండి వెలువడిన 'జనజీవ' వార పత్రికలో కొన్ని రచనలు ప్రకటితమైనాయి.

తీరిక సమయాల్లో పుస్తకాలు చదవడం,కుట్టు పని, ఎంబ్రాయిడరీ హాబీలు.

రెండవ బహుమతి



**సి. హెచ్. రాజమ్మ**

జననం 22–10–47. విద్యాభ్యాసంపోరు మామిళ్ల (కడపజిల్లా), ఖాజీపేట (వరంగల్) జిల్లా ఆర్. సి. ఎం. కాన్వెంట్లలో: రచయిత శ్రీ చెరుకుపల్లిజజయ్య ('సుధాంశు') తో 27– /–65న వివాహం. పోటీల్లో ఇంతకుముందు పాల్గొన లేదు. ఈసారి అయినా భర్తగారి ప్రోత్సాహంతో. తెలుగు కావ్యాలు, ప్రబంధాలు, బైబిల్ అంటే ప్రాణం. విశేషంగా చదువుతారు. వ్రాయడం తక్కువ. సాహిత్య సేద్యంలో, రచనా వ్యాసంగంలో ప్రథమ విమర్శకుడు, మార్గదర్శి వీరి శ్రీవారే.

మూడవ బహుమతి



**ఎం. రమామణి**

శ్రీకాకుళం తాలూకా కర్లాం గ్రామంలో 1942 జననం. 8వ తరగతి వరకూ విద్యాభ్యాసం. వీరి శ్రీవారు స్కూళ్ల సీనియర్ డెప్యూటీ ఇన్‌స్పెక్టర్‌గా ఉంటున్నారు. లోగడ అనకాపల్లినుంచి వెలువడిన 'విశారద మాసపత్రికలో యువతీలోకం శీర్షికను' నిర్వహించారు.గారలో కొంతకాలం మహిళా మండలి కార్యదర్శిగా ఉంటూ స్త్రీ, హరిజన సంక్షేమ స్థాయీసంఘాల సమావేశాల్లో పాల్గొంటూ వాటి అభివృద్ధి ఉద్యమానికికూడా తగు కృషి చేయగలిగారు. వీరికి యిద్దరు అబ్బాయిలు, ఒక అమ్మాయి.

# దేవుని తపస్సు విచిత్రరూపాలు



ఎవరైనా—దేవతలుగాని, దనుజాలుగాని, మానవులుగాని — తమ కోరికలు సఫలం కావడానికి భగవంతుని గురించి తపస్సు చేయడమూ, సాఫల్యం పొందడమూ కాన వస్తుంది.

అయినా త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులున్నూ కఠిన తపస్సులు చేసినట్లు తెలుస్తున్నది

వారు భగవంతుని అవతారరూపులు ! వారు సాధించవలసిన కోరికలు ఉంటాయా? ఉండనే వుండవు

స్వయంగా భగవద్రూపులైనవారు ఎవర్ని గురించి తపస్సు చేస్తూవున్నట్లు?

ఇలాటి సందేహాలు సాధారణంగా కలుగుతాయి

లోకంయొక్క శ్రేయస్సు కోరిమాత్రమే యివి జరుపబడుతూ ఉన్నాయని తెలుసుకుంటే ఏ సందేహానికీ అవకాశం వుండదు

లోకానికి హితాన్ని ఉపదేశించడంలో చాలా పద్ధతులున్నవి.

కొందరు పెద్ద పెద్ద ఉపన్యాసాలిస్తూ 'ఇలా చెయ్యాలి, అలా చెయ్యాలి' అని బోధిస్తూ ఉంటారు. దానితోటే తమ బాధ్యత తీరినదని తృప్తిపడతారు, తామా రీతిని ఆచరించకపోయినా. ఇలాటి బోధనల వల్ల ప్రయోజనం చాలా తక్కువ. ఆచరించేవారున్నూ అత్యల్పంగా ఉంటారు.

కొందరు 'ఇలా చెయ్యాలి' అని ఉపదేశిస్తూ, ఆ రీతిగా తామున్నూ చేసి చూపుతారు. అందువల్ల ఉపదేశకులు చెప్పిన విధంగా చెయ్యడానికి చాలామందికి ఆసక్తి కలుగుతుంది. అందువల్ల ఆ ఉపదేశాన్ని జనం గౌరవించవచ్చును.

కొందరు మాటలతో ఏమీ బోధించరు. తాము చేసే పనులవల్లనే జనులు మంచిని తెలుసుకుని, ఆ విధంగా ఆచరించాలని వారి ఉద్దేశం! చెప్పి, చేయించడం కంటె చెప్పకుండానే పని చేయించడంలోనే ఉన్నది నేర్పు!

అందువల్లనే భగవంతుడు — ఇతరులు చెయ్యవలసిన పనులను — తాను స్వయంగా చేసి చూపడం కోసమే తపస్సు చేయడం. భగవంతుడే తపస్సు చేస్తున్నప్పుడు మనవంటి సామాన్యులు ఊరక కూర్చోవడం భావ్యం కాదని జనులకు తోచకా తప్పదు. వారు ఆయనను అనుసరించకా తప్పదు.

ఈ రీతిగానే సుఖదుఃఖాలకూ, మంచి చెడ్డలకూ, సుందర వికృత రూపాలకూ భేదం పాటించకూడదని బోధించడానికే భగవంతుడు వివిధరూపాలను ధరించడం కూడా.

విష్ణువు పీతాంబరాలనూ, విలువైన నగలనూ ధరించి, రాగభోగాలను అనుభవిస్తూ శేషతల్పం మీద సుఖంగా శయనించి ఉంటే శివుడు కట్టుగుడ్డ లేక పాములను ఆభరణాలుగా ధరించి బిచ్చమెత్తుకుంటూ శ్మశానంలో నివసిస్తూ ఉంటాడు.

మనం వీరిలో ఒకరిని చూచి సంతోషించనక్కరలేదు; ఇంకొకరిని చూచి విచారించనక్కరలేదు.

'శివాయ విష్ణురూపాయ
శివరూపాయ విష్ణవే'

అనే పెద్దల మాటను బట్టి శివకేశవులకు భేదమేమీ లేదు.

మన దృష్టిలో వారి వారి అలంకారములలోనూ, జీవిత విధానంలోనూ భేదం కానరావచ్చును. కాని ఆ భగవన్మూర్తులకు భేదం తోచదు. విష్ణువు వలెనే శివుడు కూడా తన పద్ధతికి ఎంతో తృప్తిపడి ఉంటాడు.

ఇవి యిలా ఉండడానికి కారణం ఉన్నది. ప్రజలను హెచ్చరించడమే వాటి అంతరార్థం!

'ఓ ప్రజలారా! సృష్టిలో ఒకటి మంచి, మరొకటి చెడ్డా అని అనుకోరాదు. అన్ని సమానాలే! చెడ్డవి కూడా ఒకప్పుడు మంచినే కూరుస్తాయి (విషం కూడా ఒప్పుడు ఔషధంగా ఉపయోగపడుతుంది కదా!) మంచి చెడ్డలను ఆయా వస్తువులలో మనం కల్పించుకుంటామేగాని, వాస్తవానికి అవి మంచి చెడ్డలకు అతీతమైనవి, కొందరికి మంచిగా తోచినది మరి కొందరికి చెడ్డగా కానవస్తుంది. అందువల్ల ఆ భేదం పాటించకూడదు. పూలమాలనూ, నాగుబామునూ సమాన దృష్టితోనే చూడవలసి ఉన్నది'

ఇట్టి ప్రబోధాన్ని మనం వీటివల్ల గ్రహించాలి!

అవతారమూర్తులు సామాన్యులవలె తపస్సూ, విధి నియమాలనూ పాటించడం ప్రజలు ఆ విధంగా తమ తమ ధర్మాలను అనుసరించాలనే ప్రబోధం కోసమే!



# చేతకాని తనం

కె. రామలక్ష్మి



కొందరాడవారిని చూస్తే జాలేస్తుంది. కొందరిని చూస్తే కోపం ముంచుకొస్తుంది చేతకానితనంచేత అనవసరంగా యిబ్బందులు నెత్తికి తెచ్చుకుంటారు కొందరు. అటువంటి వారిని చూస్తే జాలిపడక తప్పదు కొందరలా కాదు తిని కూర్చుని కష్టాలు తెచ్చుకుంటారు. వాటికి కారణం అంతా 'ఇతరులన్నట్టు బాధ నడి పోతారు. ఇలాంటి వాళ్లని చూస్తేనే కోపం వస్తుంది.

జీవితంలో కొంతమంది అదృష్టవంతులుంటారు. వారికి ఎవరూ ఏవీ నేర్పనక్కరలేకుండానే అన్నీ వస్తాయి. చిన్నతనంలో చక్కగా చదువు అబ్బుతుంది వయస్సులో చక్కని అలవాట్లు ఏర్పడతాయి; పెళ్లి అయ్యాక సంసారం ఆనందంగా సాగించడంలోని కిటుకులు యిట్టే తెలుసుకుంటారు. ఇల్లు తీర్చి దిద్దుకోడంలో చాకచక్యం సంపాదిస్తారు. చిన్న చిన్న మనస్పర్థలని నేర్పుగా తొలగించుకుంటూ సాగిపోతారు వీళ్లు అదృష్టవంతులు. కాని అందరూ ఇలా ఉండలేరు పోనీ అని జీవితం నేర్పే పాఠాలు కూడా జాగ్రత్తగా నేర్చుకోలేరు. వారితో వచ్చిన చిక్కే అది.

'ప్రతిరోజూ ప్రతిదానికీ గొడవే ఏ ఒక్క పొద్దున్నా వారు ముఖం చంద్రుకోనిదే ఆఫీసుకు వెళ్లడం జరగడం లేదు' అంటూ ఈ మధ్య ఒక గృహిణి వాపోయింది. కారణం ఏమీలేదట. వారికి ఆఫీసుకు వెళ్లే టైముకి ప్రతీదీ సిద్ధంగా ఉండాలిట— బూట్ల దగ్గర నుంచి ఎక్కడేది చూడగానే కనబడకపోయినా ఒళ్లుమాలిన కోపం వచ్చేస్తుందిట. ఆ గృహిణి కిదంతా కారణంగా తోచకపోవడంలోనే ఉంది—ఆమె చేతకానితనం!

ఉదయంపూట ప్రతి యింట్లోనూ పని ఎక్కువగా ఉంటుంది. ఎవరూ కాదనరు కాని ఆ ఉదయంపూటే, ఆఫీసుకి బయలుదేరేవాళ్లు స్కూళ్లకి, కాలేజీలకి బయలుదేరేవాళ్లు ఉంటారు. వారిది టైముకి జరగవలసినపని. ఉదయపు పనిపాట్లు కొంచెం ఓపికగా ప్లాను చేసుకొంటే ఈ రద్దీ ఉండదు. ముందురోజు సాయంత్రమే 'ఈకూర వండుతాను'- అని వంటకాలు చూచాయగానైనా అనుకోవాలి. పిల్లల స్కూలు యూనిఫారాలు సిద్ధంగా ఉన్నాయా లేదా చూసుకోవాలి. వారి బట్టలు ఏ స్థితిలో ఉన్నాయో చూడాలి. లేకుంటే ఇవన్నీ కలిసి ఉదయాన్నే ఊపిరాడనివ్వవు. అప్పటికప్పుడు మార్కెట్టునుంచి కూరలు తెప్పించి వండడం, దానికి కావలసిన నాలుగూ లేకపోతే బజారుకి పరుగెత్తించడం, యూనిఫారాలు ఒకటిఉంటే ఇంకోటి లేకపోవడం, అయ్యగారి షర్టుకి బొత్తాలు కుట్టవలసిరావడం—ఇవన్నీ ఇబ్బందే. అందుకే కొంచెం ముందు చూపు వుండాలి అనడం. అయ్యగారిని ఒకకాలుకి నల్లసాక్సు రెండోదానికి తెల్లది వేసుకువెళ్లమనడం భావ్యం కాదు. 'న టై ఎక్కడ?' అంటే 'ఉండండి నానిగాడు గుర్రానికికట్టి లాక్కున్నాడు నిన్న సాయంత్రం' అని బదులుచెప్తే ఎంత ఓర్పుగల మనిషైనా ఊరుకోలేడు కదా!

'నేర్పు' అన్నది అనుభవం నేర్పే పాఠమే. కాని అది కొందరికి ఒంటపట్టడానికి ఒక జీవితకాలం కూడా చాలదు. వాళ్లు నిత్యవిద్యార్థులు. కొందరు జీవితపు ఒడుపులు యిట్టే పట్టేస్తారు. వాళ్లు నిజంగా నిపుణులు ఇలాంటివారిని చూసి ఈర్ష్యపడి ప్రయోజనంలేదు. వారికది సహజంగా వచ్చిన గుణంకాదు జీవితాన్ని చూసి నేర్చుకున్న, కష్టపడి సంపాదించుకున్న అనుభవం.

నేర్చుకోగలవారికీ, నేర్చుకోలేని వారికీ ఏమిటి తేడా? అంటే — అది దృక్పథంలోనే అని చెప్పక తప్పదు జీవితంపట్ల, దాని విలువపట్ల సచేతనమైన ఉత్సాహంకలవాళ్లు ఎప్పటికేనా ఏదైనా సాధించకల్గుతారు. వారికి తృప్తికరమైన జీవన విధానం కొంగు బంగారంగా ఉంటుంది అలా కాకుండా 'ఇదింతే, ఈ పద్ధతి మారదు, మార్చలేం' అని నిరుత్సాహంగా నీరసంగా పరిస్థితులకు తలఒగ్గినే చెప్పిన గృహిణిలా వాపోయేవాళ్లు ఏమీ సాధించలేరు. చేతకాని తనం వారిని యింకా, యింకా కృంగ తీసేస్తుంది

పాశ్చాత్యదేశాలలో అయితే వైవాహిక జీవితం భారంగా, బాధాకరంగా తయారు కాకముందే సవ్యంగా సరిదిద్దుకుందుకు మార్గదర్శకుల వంటి 'మారేజ్ ఎడ్వయిజరీ కౌన్సిల్సు' మొదలైనవి ఉంటాయి సంఘ సంస్కర్తలు, సేవికలు ఈ పనికి పూనుకుని కుటుంబాలు కూలిపోకుండా నిలబెట్టే ప్రయత్నాలు చేస్తాయి. కాని మనకిలాంటి సంస్థలులేవు. మన వివాహ వ్యవస్థ అటువంటి జవాబుదారీతనానికి దారియియ్యదు. కష్టమో సుఖమో భార్యా

(63వ పేజీ చూడండి)

## కన్సొలేషన్ బహుమతి

# కుటుంబ నియంత్రణ - ఫలప్రదమైన విధానాలు

ఆధునిక విజ్ఞానం వికసించి, విలసిల్లి, మానవుడు నానాటికి ముందంజ వేసే కొద్దీ దానికి తగ్గట్టుగా అదానెదుర్కొనే సమస్యలు కూడా అధిక మౌతున్నాయి. ఆహార కొరత, మిన్నంటే ధరలు, పెరిగే జనాభా తరిగే జీవన ప్రమాణాలు యిలాంటి ఎన్నో తీవ్రతరమైన సమస్యలను నేడు మన మెద ర్కొంటున్నాం. ప్రజలు అమాయకులుగా వున్న రోజులలోనే ఎంతో సుఖశాంతులక నోచుకొనేవారు విజ్ఞానం నలుమూలల ప్రబలే కొద్దీ మన అశక్తత కూడా ద్యోతకమవుతూనే వుంది పరిస్థితులు తనశక్తిని మించిపోకుండా అదుపులో వుంచుకొనేందుక ప్రకృతి తీసికొనే రక్షణయేమో, బహుశ యిది!

మన జనాభా అమితంగా పెరిగిపోతున్నది. దీన్ని అదుపులో వుంచకపోతే తీవ్ర పరిణామాలను ఎదుర్కొనవలసి వస్తుందని పలువురు ప్రముఖులు ఆందోళన చెందుతున్నారు ఒక విధంగా ఆలోచిస్తే నేడు మనలను పీడిస్తున్న సమస్యలలో చాలా మట్టుకు, యీ విపరీతమైన జనాభా పెరుగుదల మౌలిక కారణంగా కలవేసవిపిస్తుంది. కాని యీ సమస్య కేవలం మనదేశాని కొక్కటే పరిమితమైనది కాదు. చైనా, అమెరికా, బ్రిటన్, ఇంగ్లండు మున్నగు పెక్కు వేరే దేశాల్లో కూడా జనాభా పెరుగుతూవుంది. ఇందువల్ల ప్రపంచంలోని చాలా దేశాల్లో కుటుంబ నియంత్రణ పథకాలను అమలు జరుపుతున్నారు. ఇది అనుసరణీయమైన విధానమే. లేకుంటే కొన్ని దశాబ్దాలలో ప్రపంచమే గొప్ప చైతన్యా న్నెదుర్కొని తీవ్ర సంక్షోభానికి గురికావలసి వస్తుంది. అదను మించిన తరువాత అదుపులోనికి ఒకేసారిగా తేవడం దుస్సాధ్య మవుతుంది. కనుక యిప్పటినుంచి తగు జాగ్రత్తను తీసికొని, జనాభాను అదుపులో వుంచుకొనేలా చూసుకోవడం అత్యవసరం.

ఒకవైపు ప్రపంచంలో చాలా దేశాలు హద్దూపద్దూ లేకుండా పెరిగిపోయే జనాభాతో గాభరాపడుతుంటే, మరొకవైపు కొన్నిదేశాలు జనాభా తగ్గుదలకు ఆందోళన చెందుచున్నాయి. కమ్యూనిస్టు దేశాల్లో ముఖ్యంగా హంగరీ, జెకోస్లవేకియా, బల్గేరియాలలో జననాల సంఖ్య గత పదిసంవత్సరాలుగా ఆందోళన కలిగించే విధంగా పడిపోయింది జననాల నిష్పత్తి రుమేనియాలో వేయికి 13, హంగరీలో 12.9కి పడిపోయింది హంగరీలో ప్రతి ఒక్క జననానికి రెండు గర్భస్రావాలు జరుగుచున్నాయట. ఇలాగే జరిగితే పాతిక సంవత్సరాలలో యువకుల సంఖ్య బాగా తగ్గిపోయి, వృద్ధుల సంఖ్య పెరిగిపోవచ్చని ప్రభుత్వం ఆందోళన చెందుచున్నది. అలాగే సంతనాభివృద్ధిని ప్రోత్సహించేందుకు బిడ్డలు గల తల్లులకు, అవివాహితులైనా సరే జీతంతో సెలవు యిచ్చేందుకు ప్రాగ్ ప్రభుత్వం నిశ్చయించింది. బల్గేరియాలో జననాల నిష్పత్తి 1000కి 19.5 నుండి 1956లో 16 వరకు పడిపోయింది. 'వివాహం చేసుకుని పిల్లల్ని కనడం దేశభక్తులందరి పవిత్రధర్మం' అని బల్గేరియా ప్రభుత్వం ప్రచారం చేస్తున్నది. ఇవన్నీ మనకు ఎబ్బెట్టుగానో, ఆశ్చర్యంగానో తోచవచ్చు. కాని ఏ సమస్య అయినా ఆయాదేశాల పరిస్థితులనుబట్టి పరిష్కరించవలసివస్తుంది. అంతే కాని ఏవో సనాతనధర్మాల్నిపట్టి ప్రేలాడుతూ వుంటేకాదు. పరిస్థితులనుబట్టి ప్రాధాన్యత నివ్వాలి.

పోతే మనదేశంలో అపారంగా పెరిగిపోతున్న జనాభాను, భవిష్యత్పరిణామాల రూపాన్ని గుర్తించి మన ప్రభుత్వం కుటుంబ నియంత్రణ పథకాన్ని ప్రవేశపెట్టింది. ఇది హర్షించదగ్గ విషయమే. జనాభాను మితిమీరకుండా అరికట్టవలెనన్నది నిర్వివాదాంశం, అనుసరణీయం, సమర్థనీయం కాగా దాన్ని ఏయే విధానాలద్వారా సాధించాలన్నదే ముఖ్య విషయం. మన వుద్దేశం మంచిదే కావచ్చు, దాన్ని సాధించేమార్గం కూడా సరియైనదే కావాలికదా?

మన ప్రభుత్వం కుటుంబ నియంత్రణ విషయంలో యింత తీవ్రంగా కృషిచేస్తున్నా ఎన్నో అడ్డంకుల నెదుర్కొనవలసివస్తున్నది. ఈ పథకం విజయవంతం కావడంలేదు.

# డాక్టర్ కబుర్లు

## పిత్తకోశం వికారాలు

సాధారణంగా పిత్తకోశం వ్యాధి ఉన్నవారు, ఆడవారు నలభయిఏళ్ల పయిబడ్డవారు, లావుపాటివారు, కడుపులో వాయువు ఎక్కువ పుట్టేవారు ఎర్రగ ఉండేవారు అయి ఉంటారు (అమెరికాలో).

ఇది పూర్తి నిజంకాదు. కాని పిత్తకోశ వ్యాధులు ఉన్నవారిలో వనితలే అధికం. ఇది సుమారు 30 సంవత్సరాల వయస్సులో వస్తూ ఉంటుంది. అంతేకాక, సన్నగా, నల్లటిజుట్టు, కలవారిలోనే అధికంగా వస్తూ ఉంటుంది. (తెల్లజాతి వారిలో చర్మం ఎరుపురంగుతోబాటు జుట్టు, కళ్లలో రంగు లోపిస్తూ ఉంటుంది కదా!)

అజీర్ణంలో బాధపడేవారు పిత్తకోశ పరీక్ష వెంటనే చేయించుకోవాలి. శస్త్ర చికిత్సకి వెనుదియ్యరాదు. ఆడవారయితే గర్భం దాల్చినప్పుడు చిక్కు రాకుండా ముందే జాగ్రత్త పడటం మంచిది. గర్భం దాల్చకముందు ఆపరేషన్ చేయటం మేలు.

డా. ఎల్. [illegible]
(కాకినాడ)

అందుచేత? ఏదైనా ఒక సమస్యా పరిష్కారానికి కాని, విషయ సాధనకు కాని పూనుకొనేప్పుడు, అందులోని గుణదోషాలను, వుచితానుచితాలను కూలంకషంగా పరిశీలించాలి. మన మనుసరింప దలచుకొన్న విధానాన్ని వివిధ దృక్కోణాలలో నుంచి పరిశీలించి న్యాయ దృష్టితో చూడాలి. అప్పుడే

# కుటుంబనియంత్రణ...

అది విజయవంతం కాగలదు. అది లోపించినప్పుడు దానివలని ప్రయోజనంకన్నా అధికంగా అనర్థాలే ప్రాప్తిస్తాయి.

మన దేశంలో గ్రామాలెక్కువ. నిరక్షరాస్యుల సంఖ్య ఎక్కువ. వారిలో మూఢ విశ్వాసాలు, అజ్ఞానం ప్రబలంగా వుంటాయి అలాంటప్పుడు వారికి ప్రభుత్వమేదో ఆశ చూపి లొంగదీసుకొనేలాటి ధోరణిలో ప్రవర్తించకూడదు బలవంతంగా వారి సుఖ శాంతులను దోచుకొనే రీతిలో వ్యవహరిస్తున్నదనే శంకను వారికి కల్పించకూడదు. కుటుంబ నియంత్రణ పథకాన్ని గ్రామీణ స్థాయిలోనుంచి ప్రచారం చేసినప్పుడే అది విజయవంతం కాగలుగుతుంది. గ్రామాలలో విశేషంగా ప్రచారం చేయడం, అందలి గుణదోషాలను చర్చించి నచ్చచెప్పడం, విద్యను ప్రోత్సహించడం, నిజా నిజాలను తెలియపరచి ప్రోత్సహించడం చేసినప్పుడు, వారికి వారే ఐచ్ఛికంగా అందుకు ముందంజ వేస్తారు. కుటుంబ నియంత్రణకు సంబంధించిన చలనచిత్రాల ప్రదర్శనకూడా ఎంతో ఉపయోగకారి.

ఈ పథకం విజయానికి డాక్టర్ల, స్త్రీల సహకారంకూడా ఎంతో అవసరం. స్త్రీ తన సంసారాన్ని ఆనందమయంగా తీర్చిదిద్దుకొనే, రీతిగా సాధ్యమైనంత తక్కువ సంతానాన్ని రూపొందించుకోవడం అత్యవసరం. పరిమిత సంతానం అపరిమితానందాన్నిస్తుందనే నైజాన్ని గుర్తించి దాన్ని అమలు జరపాలి ఇతర స్త్రీలకు, తెలియని వారికి ఆదర్శంకావాలి డాక్టర్లు ఇతోధికమైన శ్రద్ధాసక్తులతో కృషించి ప్రజలలో విముక్త ప్రోత్సాహోత్సాహాలను కల్గించాలి. ఓరల్ కాంట్రాసెప్టివ్స్, లూప్స్. ట్యాబ్లెట్స్ మొదలుకొని, స్టెరిలైజేషన్ వంటి ఆపరేషనులు మొదలగు ఎన్నో విధానా లున్నాయి. వారి వారి నైజానికి, అవసరానికి తగ్గట్లు వైద్యులు వ్యవహరించాలి. పత్రికలలో, రేడియోలలో విశేష ప్రచారానికి, ప్రసారానికి అవకాశమివ్వాలి

అంతేకాని బాలికల వివాహ వయస్సును పెంచడం, నిర్బంధంగా ఆపరేషన్లు చేయడం లాంటి నియత్పృత్వ ధోరణులను ప్రజాస్వామ్యంలో కల్పించి, ప్రజలలో అపోహలను, భయాందోళనలను కల్గించి వారిని విముఖులుగా పరోక్షంగా తయారుచెయ్యడంతగదు. ఇలాంటివానిని గురించి ఆలోచించేప్పుడు సాంఘిక వ్యవస్థను, నైతికస్థాయిని గమనించి పరిరక్షించడం అవసరం. కనుక ఆచరణ యోగ్యమైన విధానాలనే విస్తృత కృషితో విజయానికి పాటుపడాలి

—కుమారి ఎస్. కమల

# జనాభా పెరుగుదల - కుటుంబనియంత్రణ

జనాభా ఒక ఏటి కొక ఏడు పెరగడం సహజం. అది మితంగా పెరిగితే ఫరవాలేదు కాని ప్రస్తుతం అపరిమితంగా పెరుగుతూండడం వల్ల అనేక సమస్యలు చిక్కులు ఎదురవుతున్నాయి 1964లో 472 కోట్లు వున్న జనాభా 1976కి అంటే మరో తొమ్మిది ఏళ్ళకి 648 కోట్లు, మరో పదేళ్ళకి (1986) 856 కోట్లు అవ్వగలదని అంచనా ఇలా అదుపు లేకుండా జనాభా పెరగడం వల్లనే మన ప్రణాళికలన్నీ తల్లక్రిందులవుతున్నాయని ప్రభుత్వం అంటోంది. ఆ జనాభాకి సరిపోయే తిండీ, బట్టా మాట అటుంచి చోటుకీ, నీటికీ కూడా ఎద్దడి రాగలదని భయపడుతోంది అందువల్ల జనాభా పరిమితంగా పెరిగేటట్లు చేయడానికి పథకాలు వేశారు వివాహానికి సమ్మతించడానికి కన్యకుండవలసిన వయఃపరిమితిని పెంచడానికీ, గర్భస్రావం చట్టబద్ధం చేయడానికి వీలు వుంటుందేమోనని ఆలోచనలు చేస్తున్నారు

అయితే పథకాలు రూపొందించేది ప్రభుత్వమైనా అమలు పరిచేది ప్రజలే ప్రజలు తమతమ కుటుంబాల్ని పరిమితం చేసుకుంటే దేశ జనాభా పరిమితం అవుతుంది.

కుటుంబాన్ని ఒక పథకం ప్రకారం పెంచుకోవాలన్నదే కుటుంబ నియంత్రణ యొక్క ధ్యేయం అందుకు అనుసరించవలసిన పద్ధతుల్ని ప్రజల్లో ప్రచారం చెయ్యడానికే కుటుంబనియంత్రణ కేంద్రాల్ని ప్రభుత్వం స్థాపించింది వీటి ద్వారా విషయాలను తెలపడానికి, పరికరాలను, సాధనాలను సరఫరా చేయడానికీ (వీలైతే వుచితంగా కూడా) పూనుకుంటోంది ఆపరేషన్లు అందరికీ అందుబాటులో వుండేటట్లు చేయదల్చుకుంది. ఎంతో డబ్బు ఖర్చుపెట్టడానికి సిద్ధపడుతోంది. అయితే ఈ ఖర్చు దండుగకాకుండా, కోరిన ఫలితాలు కలగాలి.

కాని కోరినంతగా ఫలితం కనిపించకపోవటానికి కారణం ఏమిటా అని ఆలోచిస్తే ముఖ్యమైనవి మూడు కనిపిస్తున్నాయి (1) ప్రజలలోని అజ్ఞానం (2) కుటుంబ నియంత్రణపట్ల వ్యతిరేకత (3) అశ్రద్ధ, నిర్లిప్తత.

నిరక్షరాస్యత ఎక్కువగా వున్న ఈ దేశంలో కుటుంబ నియంత్రణ ఆవశ్యకతగాని, విధానాలుగాని తగినంతగా ప్రచారంలోనికి రాలేదంటే ఆశ్చర్యంలేదు మారుమూల గ్రామస్థులకు, పత్రికలు రేడియోలద్వారా విషయాలు తెలుసుకునే అవకాశం లేని వాళ్ళకు ఈ విషయాలు ఇంకా విపులంగాను, వాని ఆవశ్యకతని వారు గుర్తించే విధంగాను ప్రచారం చెయ్యవలసిన అవసరం ఎంతయినావుంది వారికి వున్న అపోహలను భయాలను తొలగించగలగాలి అలా కాక కేవలం పట్టణాలలో సభలుచేసి, పత్రికల్లో వ్యాసాలు రాసి, రేడియోల్లో ప్రసంగాలు చేసి తృప్తిపడితే కలిగే ప్రయోజనం తక్కువ ఎన్ని కుటుంబ నియంత్రణ కేంద్రాలు నెలకొల్పి, ఎంత సిబ్బందిని పెట్టినా వాటిని వుపయోగించుకునే వారి సంఖ్య తక్కువగానే వుండి ఫలితాలు గమనీయంగా వుండవు

తెలియనివారిని వదిలేస్తే తెలిసినవారిలో చాలామంది మూఢనమ్మకాలవల్ల, ఛాందసత్వంవల్లా సహకరించ నిరాకరిస్తున్నారు. 'నీరు పోసినవాడు నారు పొయ్యడా' 'దేముడిస్తుంటే వద్దనడానికి మన మెవరం,' 'పిల్లల్ని కనకుండా సాధనాలు వాడటం భ్రూణహత్యతో సమానం, ప్రకృతివిరుద్ధం' ఇత్యాదులు వీరి వాదనలోని ముఖ్యాంశాలు. ఇలాంటి వీరి వాదనలు పాతకాలపు మాటలు. నేటి పరిస్థితులకు అన్వయించని వాడుకలు. గర్భంలో పిండమే రూపొందనప్పుడు అది హత్య ఎలా అవుతుంది? ప్రకృతే కొన్ని సమయాలలో పిల్లలు కలగకుండా ఏర్పాటు చేసినప్పుడు ప్రసవానంతరం కొంతకాలం వరకూ, ఋతుక్రమంలోని కొన్ని దినాల్లోనూ, 'సేఫ్ పీరియడ్' అది ప్రకృతి విరుద్ధం ఎలా అవుతుంది? ఉన్న సంతానానికే మంచి భోజనం శుభ్రమైన దుస్తులు, తగిన విద్య సమకూర్చలేనప్పుడు దేముడిస్తున్నాడంటూ, ఇంకా కనడం సమంజసమని ఇంగితజ్ఞానంవున్న వాళ్ళెవరనగలరు? ఈ ఛాందసుల వాదనల్ని ఖండించి, అందులోని లోపాలను ఎత్తిచూపి వీరి ప్రచారం ప్రజలమీద ప్రభావం చూపకుండా వుండేలాగ చేయడం ప్రభుత్వంయొక్క, బాధ్యతగల పౌరుల యొక్క కర్తవ్యం.



ఇక పోతే కుటుంబ నియంత్రణ అవసరం తెలిసీ, విధానం తెలిసీ, 'ఇంతలో ఏమవుతుందిలే' మరోసారి చూదాం 'ఇంకో కొడుకు పుట్టనీ' అంటూ అశ్రద్ధ చేసి వాయిదాలు వేసేవారు కోకొల్లలు వీరు తమ అశ్రద్ధవల్ల తమ కుటుంబాలకీ, దేశానికి ఎంత అపకారం చేస్తున్నారో గుర్తించేలాగ చేయడం అవసరం.

ప్రజలు సహకరిస్తేనే ఏ ప్రణాళికైనా విజయవంతం అవుతుంది వారిలో చైతన్యం రావాలి. తమ ప్రణాళికలపై, పథకాలపై నమ్మకం కల్గించి, అది అమలు జరపాలన్న ఉత్సాహం వారిలో కలిగేలా చేయడం ప్రభుత్వ బాధ్యత

ఈ నమ్మకం కలిగిన పౌరులు తమ కుటుంబాల్ని పరిమితం చేసుకోవడంతో వూరుకోక, అది వ్యక్తిగత సమస్యేగాక సంఘ సమస్యగా కూడా గుర్తించి తమ సోదరపౌరుల్లో ప్రచారం చెయ్యాలి ఇందుకు స్త్రీలు కూడా బాధ్యత వహించాలి దిన దినానికి ధరలు పెరిగిపోతున్న ఈ రోజుల్లో సంసారం పెరగడంవల్ల కలిగే ఇబ్బందులు, ఎడంలేని కాన్పులవల్ల కలిగే అనారోగ్యాలు స్త్రీలను బాధించినంతగా పురుషులను బాధించడంలేదు. స్త్రీలు తమ భర్తల్ని ఒప్పించి ప్రోత్సహించి కుటుంబాన్ని పరిమితం చేసుకోవాలి ఏ కొద్ది చదువున్న వారైనా ఈ సంగతులు తెలియవని తప్పించుకోవడం క్షంతవ్యంకాదు పత్రికల్లో, రేడియోలో దినమూ ప్రచారమయ్యే విషయాలు విని వడకపోవు కుతూహలం వుంటే నేర్చుకోటం, తెలుసుకోవటం కష్టమూకాదు తాను తెలుసుకున్న విషయాలు తమతోటి స్త్రీలకు వివరంగా చెప్పి వారు వాటిని అనుసరించేలా చేయాలి అది తమ విధిగా భావించాలి ఇలాంటి విషయాలు పది మందితో చర్చించటం తప్పుగా, సిగ్గుపడవలసిన విషయంగా భావించరాదు.

ప్రజలు, ముఖ్యంగా స్త్రీలు తమ కుటుంబంపట్ల, దేశంపట్ల తమ కర్తవ్యాన్ని బాధ్యతని గుర్తించి ప్రవర్తించిన నాడు, తమ విధిని నిర్వహించిననాడు కుటుంబనియంత్రణ పథకం చాలావరకూ విజయవంతం కాగలదని నా నమ్మకం.

—శ్రీమతి ఉమా వెంకట్రామన్

# వారఫలం

**20-10-1967 శుక్రవారం మొదలు**
**26-10-1967 గురువారం వరకు.**

**మేషం** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో సంతృప్తికరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు

**వృషభం :** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగిపోతాయి. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది ప్రయాణాలు శ్రమవిూద ఫలిస్తాయి శుభకార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది నూతన విషయాలను తెల్సుకొంటారు

**మిధునం** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది అధికవ్యయం జరుగుతుంది ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది పాటివారిలో గౌరవం లభించగలదు

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో స్వల్పభేదాభిప్రాయాలు రావచ్చును బంధుమిత్రులను కల్సుకొంటారు

**కర్కాటకం** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు కార్యరూపాన్ని ధరించగలవు సాహసముతోకూడిన వ్యవహారాలు లాభిస్తాయి వారంమధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి బంధువులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం:** వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగ నెరవేరుతాయి ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. వలసినడబ్బు సమయానికి అందుతుంది సజ్జనసాంగత్యం లభిస్తుంది

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి దైవకార్యాలు నెరవేరుతాయి

**కన్య** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో వివాక్షత కలిగిస్తుంది.

**తుల :** లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది ఉద్యోగంలో తోటివారిని విశేషంగా నమ్మడం తగదు వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగ ఉంటుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం** ఫలితం మాటయెలాగున్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది అధికవ్యయం జరుగుతుంది

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు ప్రయాణాలోచనలు చేస్తారు

**ధనుస్సు** కొన్ని వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం వలన ప్రయాసకు గురికాగలరు. వ్యాపారంలో పాటివారితో పోటీ పెరుగుతుంది. సమయానికి యేదో ఒక విధంగ డబ్బుచేతికి వస్తుంది వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో సంతృప్తికరంగా ఉంటాయి ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మకరం** ఇప్పుడు మీరుచేసే ప్రయత్నాలవల్ల ముమ్ముందుకూడా ఉపయోగం ఉంటుంది సాహసముతోకూడిన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి నూతన వ్యవహారాలు శ్రమవిూద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలసంచలనం పెరుగుతుంది సజ్జనసాంగత్యం లభిస్తుంది

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది బంధుమిత్రులను కల్సుకొంటారు

**కుంభం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది ఆర్థికవ్యవహారాల్లో మొగమాటాలు తగవు ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు — కుటుంబ కార్యక్రమాలకు సహార్యులు వస్తాయి పుణ్యకార్యాలు చేస్తారు

**మీనం·** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. నూతన వ్యవహారాలు లాభించగలవు ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు ప్రయాణాలు ఫలిస్తాయి

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు

—మహేష్ ●




పశ్చిమదేశపు రాజు తిరిగి మల్లన్న మంత్రి రాజ్యంమీదకు దండయాత్ర చేయడానికి ప్రయత్నం చేస్తున్నట్లుగా మల్లన్న మంత్రికి తెలిసింది. పశ్చిమ దేశంనుండి మల్లన్నమంత్రి రాజ్యానికి వచ్చే దారిలో చాలా కొండలుఉన్నాయి. ఆ కొండలు చాలా ఎత్తుగాను, నిలువుగాను ఉంటడంవలన ఆ దారిని ప్రయాణం చేసే సైన్యం ఆ కొండలకు చుట్టూ తిరిగి ప్రయాణంచేయవలసి ఉంది. కొండల మీద నుంచి మార్గాన్ని నిర్మిస్తే స్వల్ప కాలంలోనే ఒక రాజ్యంనుంచి మరొక రాజ్యాన్ని చేరుకోవచ్చును.

పశ్చిమ దేశపు రాజు, తనమీదకు దండయాత్ర చేయడానికి సన్నాహాలు చేస్తున్నాడని తెలియగానే మల్లన్న మంత్రి కొండలమీదుగా పశ్చిమ దేశానికి దారిని నిర్మించవలసినదిగా ఆజ్ఞాపించాడు. మల్లన్న మంత్రి ఆజ్ఞను విని సైన్యాధికారులు విభ్రాంతపోయారు, కొండదారిని నిర్మించినట్లయితే పశ్చిమదేశపు సైన్యం ఆ దారి మీదుగానే తమమీదకు రావచ్చునని వారు భయపడ్డారు. కాని యెవరూ యీ సంగతిని మల్లన్నమంత్రికి చెప్పడానికి సాహసించలేదు.

సైన్యాధికారుల అభిప్రాయం రాజుకు కూడా తెలిసింది. కాని, 'మల్లన్నమంత్రి తెలివితక్కువగా ఇటువంటి పనికి పూనుకోడు. దీని వెనుక యేదో ఒకయెత్తు వేసి ఉంటాడు' అని అనుకొని రాజు ఊరుకొన్నాడు. ఆఖరుకు సైన్యాధిపతి మాత్రం తన సందేహాన్ని మల్లన్న మంత్రికి తెలియజేశాడు. మల్లన్న మంత్రి చిరునవ్వు నవ్వి ఊరుకొన్నాడు కాని దానికి సమాధానం ఏమీ యివ్వలేదు.

కొద్దికాలంలోనే మల్లన్న మంత్రి చెప్పిన ప్రకారం భటులు కొండదారిని




నిర్మించారు. చాలా కొద్దిమంది భటులను మాత్రం ఆ దారికి కాపలాకాయడానికి మల్లన్న మంత్రి నియమించాడు. దీని అంతరార్థమేమిటో యెవరికీ తెలియలేదు.

మల్లన్న మంత్రి కొండ దారిని నిర్మింపచేసిన వార్త పశ్చిమ దేశపు రాజుకు తెలిసింది. ఆ దారిని స్వాధీనం చేసికొన్నట్లయితే చాలా సులువుగా తాము మల్లన్నమంత్రి రాజ్యాన్ని చేరుకొనగలమని పశ్చిమ దేశపు రాజు, ఆ దేశపు సైన్యాదికారులు అనుకొన్నారు. కొండదారికి కాపలాగా కొద్దిమంది భటులు మాత్రమే ఉన్నారని తెలియగానే పశ్చిమదేశపు రాజు 'యిదే సమయ' మనుకొని తన భటులను పంపి కొండ దారిని ఆక్రమించుకొన్నారు.

పశ్చిమ దేశపు సైన్యం వెంటనే కొండదారిమీదుగా మల్లన్న మంత్రి రాజ్యంమీదకు ప్రయాణంసాగించింది. ఆ సైన్యం దారిలో ఒక చోటకు రాగానే ఆకస్మికంగా ఒక పెద్ద బండ సైన్యానికి ముందుగా పడింది. దానితో పశ్చిమదేశపు సైన్యంలో కలకలం బయలుదేరింది, పశ్చిమదేశపు సైన్యం ఉన్న చోటుకు ఒక వైపున పెద్ద అగాధం, మరొకవైపున యెత్తయిన కొండా ఉన్నాయి. అందుచేత యెటు వైపుకు వెళ్ళడానికి అవకాశంలేక ఆ సైన్యం వెనుకకు మళ్ళింది, అంతలో మరొక పెద్ద బండ ఆ వైపున కూడా పడింది.

'ఇదంతా మల్లన్న మంత్రి పన్నిన పన్నాగమే' అని శత్రుసైన్యం అనుకొనే లోపున మల్లన్నమంత్రి సైనికులు కొండమీదనుంచి శత్రుసైన్యం మీదకు పెద్దపెద్ద రాళ్ళను దొర్లించి, దాన్ని నాశనం చేసివేశారు. రాజు, సైన్యాధికారులూ కూడా మల్లన్న మంత్రిదూరదృష్టిని కొనియాడేరు.

సీరియల్

తాడిగిరి పోతరాజు



**జరిగిన కథ**

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాధ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. వాగ్దానాన్ని గుర్తుతెచ్చుకుని శారదను ప్రసాద్‌తో వివాహానికి అంగీకరించమంటాడు కామయ్య. శారద బాధపడుతుంది అంతా అర్థంచేసుకున్న ప్రసాద్ శారదను మధుదగ్గరికి చేర్చడానికి బస్సుఎక్కిస్తాడు. తర్వాత అతను ఇల్లు విడిచి వెళ్ళిపోతాడు. కామయ్య మాష్టారు బెంగపెట్టుకుని చిక్కి శల్యమైపోతాడు. భాస్కర్ భానుమీద శ్రద్ధ చూపిస్తుంటాడు. ధైర్యం చెబుతుంటాడు

# 28

చెయ్యి విరిగిన కుర్చీలో కూర్చొని భాస్కర్ దినపత్రిక చదువుకోసాగాడు. ఎనిమిది గంటలవరకూ మాష్టారికి మెలుకువ రాలేదు. అప్పటివరకూ భానూ అతన్ని పల్కరించలేదు. పల్కరించటానికై అతను తనకేసి చూస్తే దోషిలా చూపులు క్రిందకు దించుకుంది. అంతే — భరింపరాని స్తబ్ధతలో రెండుగంటలు గడిచిపోయ్యాయి.

మాష్టారికి మెళుకువ కలిగి కళ్ళు తెరచాడు. రెండుచేతులెత్తి వినయంగా గురుదేవులకు నమస్కరించాడు. ప్రత్యభివందనం చెయ్యటానికై - ఛాతీపై పెట్టుకొన్న చెయ్యి కొద్దిగా పైకెత్తాడు.

'కూర్చో — భాస్కర్ ... కూర్చో...' అంటూ ప్రయత్నపూర్వకంగా ప్రక్కమీద నుండి లేచి కూర్చున్నాడు కామయ్యగారు.

'చాలారోజులైంది— భాస్కర్ ... నిన్ను చూసి.. ఇప్పుడు శెలవులు కదూ?' భాస్కర్ మాష్టారి శుష్కించిన శరీరాన్ని కన్నార్పక చూడసాగాడు. వారి మాటలు అతని స్మృతిలో ప్రవేశించలేదు. అతని కళ్ళతో నీళ్ళు తిరిగాయి మెల్లగా మంచం వద్దకొచ్చి — 'ఇంత జబ్బులో ఉండికూడా ఎవరికీ కబురు చెయ్యకుండా ఎందుకిలా అయిపోతున్నారు... మేమందరమూ లేమాండీ'... అన్నాడు.

'ఆఁ...ఇది కూడ పెద్ద జబ్బా...వెనకటి గుండెజబ్బే ... వయసు మళ్ళుతుంది కదా...మళ్ళీ తిరగపెట్టింది... అంతే'... అంటూ వెల్లకిలా పడుకొన్నారు కూర్చోలేక.

'పెద్ద జబ్బు కాదంటారేంసార్ ... కనీసం కూర్చోటానికి కూడ శక్తి లేకపోతే...డాక్టరుకు చూపించారా?'...

డాక్టరెందుకోయ్...దానంతట అదే తగ్గిపోతుంది'...

'జబ్బులు వాటంతటవే పోతాయా మాష్టరూ?... ముందు మీరు కొంచెం లేచి ముహం కడుక్కుని కాఫీ త్రాగండి... తరువాత నేను వెళ్ళి డాక్టర్ని తీసి కొస్తాను.' అన్నాడు.

మాష్టారు ముహం కడుక్కుని కాఫీ తీసికొన్నారు. ముఖం తేటగా ఉల్లాసంగా కనిపించింది. భాస్కర్ కొద్దిసేపు తటపటాయించి మొదలెట్టాడు.

'సార్ ... చిన్నప్పటినుండి నాకు విద్యాబుద్ధులుచెప్పి ఇంతవాణ్ణిగా తయారుచేశారు ... నేను మీకెంతో ఋణపడి ఉన్నాను ... దాన్ని నే నేవిధంగా కూడా తీర్చుకోలేను...అయితే మీరు ఈ వయస్సులో ఆర్థిక పరిస్థితులను గూర్చి ఆలోచించి ఆరోగ్యం పాడుచేసుకోకండి... అంటే మీరు నా యెడల చూపిన ప్రేమకు డబ్బుతో విలువకట్టడం కాదు...నేను కాలేజీకి వెళ్ళిపోతాను కదా?...అందువలన ఇప్పటికి ఈ రెండువందలూ తీసికొని ప్రస్తుతావసరాలు గడుపుకోండి...తరువాత'... చెప్పలేకపోతున్న మాటలు — కొత్తగా ఉపన్యాసమిస్తున్న యం.యల్.ఏ.లా చెప్పాడు.

మాష్టారు చేతిలోఉన్న నోట్లకట్టని వైపు నిశితంగా ఒకచూపు విసిరాడు. ఆయాసంతో ఆయన ఛాతి ఎత్తుగా ఉబ్బింది. కొరకొరా ఆ డబ్బుకేసి చూసి బలంగా ఆ డబ్బు లాక్కుని విసురుగా భాస్కర్ ముఖాన విసిరికొట్టాడు.

'డబ్బుతో నన్ను మోసం చేద్దామనుకొంటున్నావా—రోగ్...ఈ వేషాలిక నావద్ద సాగవ్ ... జాగ్రత్త— రెండునిముషా లిక్కడున్నావంటే పోలీసులకు పట్టిస్తా... అందర్నీ నమ్మి మోసపొయ్యేటంత అవివేకిని కానిప్పుడు'...

అంత జ్వరంలోనూ చివ్వునలేచి కోపావేశంతో పల్కుతూన్న వ్యక్తిని చూసి భాస్కర్ దిగ్భ్రమతో నిలబడిపొయ్యాడు. ఆయన మాటల్లో భావమేమిటో ఎంతసేపటికీ అర్థంకాలేదు.

'వాడికీ — 'నీకూ' అంతర్యంలో ఏమీ భేదంలేదు. నాపై విశేషమైన భక్తి గౌరవాలున్నట్లు నటించి నన్ను మోసం చేశాడు. నాతల్లిని నాకు దూరం చేశాడు. మీరు కూడా అలానే మోసంచేసి లేచిపోదామని చూస్తున్నారేమో...ఈ బొందిలో ప్రాణముండగా అలా జరుగదు'...

త్రాగుబోతు వ్యక్తావ్యక్త ఆలాపనలా సంధ్రికమ్మిన రోగిలా మాటలు పలుకుతున్నాడు.

భాస్కర్ పిడుగుపడినవానిలా అంతర్వాణి మానుడైపొయ్యాడు.

విద్యావ్యాసంగం ద్వారా, అనుభవపూర్వకంగా జీవిత తత్వాన్ని తరచిచూసి, బ్రతుకులో ఒక నిర్ణీత మార్గాన్ని సృజించుకొని పురోగమించిన మాష్టారు — భాష్య

ప్రపంచంతో ఎన్ని విఘాతాలు తగిలినా, నమ్మిన సత్యాన్ని అసమాన దీక్షతో పూజించిన ధీశాలి — సనాతనాచారాలతో జీర్ణించిపోతున్న ఊరికి జీవంపోసిన అపర దైవం — తనలాంటి విద్యార్థులలో విజ్ఞాన జ్యోత్స్నలను వెలిగించి — విరియించి జీవిత పరమావధి చూపిన అఖండజ్యోతి — ఈ విధంగా మాట్లాడటం చూసి విస్తుపోయ్యాడు భాస్కర్.

సంఘం—సన్మానం — సానుభూతి ఎటు చూసినా దూరంగా ఉన్నప్పుడు ఆ నిస్పృహ మానవుణ్ణి ఏవిధంగా బలహీన పరుస్తుందో భాస్కర్ అవగాహన చేసికొన్నాడు. మాష్టారి జీవితంలో పూర్వార్ధానికీ, ఉత్తరార్ధానికీ పోలికంటూ లేదు. శక్తివంచనలేకుండ స్వార్థరహితంగా, ప్రజాభ్యుదయంకోసం జీవితం త్యాగం చేసినందుకు తనకు మిగిలిందేమీ లేదు. ఆ అనుభవాల వెలుగులో ఎన్నో [illegible].

'ఊ... [illegible] ... ఇదిగో నీ డబ్బు'... నేలమీదకొంగి డబ్బుతీసి మళ్లీ ఇచ్చాడు.

యాంత్రికంగా నడిచివెళ్లాడు భాస్కర్.

చిరిగిన లాల్చీ నుండి ఒక చెయ్యి నిర్జీవంగా వ్రేలాడుతూంటే కుంటికాలుతో వంకర అడుగులేస్తూ చేతికర్రతో సైగ చేసికొంటూ, ఏదో మాటలంటూ, భాస్కర్‌ను వీధి వరకూ అనుసరించి వాకిలి దిగి సూటిగా నడిచి వెళ్లాడు.

టేబిల్‌పై ముఖం పెట్టుకొని అచేతనంగా కుర్చీలో కూర్చున్న భామ రెప్పపాటులో వీచిన తుఫాను గ్రహించింది. రెండుచేతులూ ముఖానికి కప్పుకుంది. పమిట చెరగు తడిసిపోయింది. ఐదునిముషాలు గడిచిపోయ్యాయి. కళ్లు తెరచి చూసింది.

ఎదురుగా—నిలువుగా రెండు ముక్కలై మసక బారిన అద్దం—దానిలో తన ప్రతిబింబాన్ని పరీక్షగా చూడసాగింది.

'నల్లనిరూపం — నిద్రలేమిచే ఎర్రగా ఉండి — అశ్రువులతో పరివేష్టితమై మెరుస్తున్న ఇంతంత కళ్లు — ఎండిపోయి లోపలికిపోయిన బుగ్గలు. చిన్న తనంలో మశూచి పొయ్యటం వలన ముఖంపై ఏర్పడిన చిన్న చిన్న గుంటలు — స్పష్టంగా కన్పిస్తున్నాయి. సన్నగా పీలగా ఉండి అంత వికారంగా కన్పిస్తుంది రోగిష్ఠిదానిలా— ఇంకా తేరిపార చూచుకొంది.

తనకూ—తన అక్కకూ—ఎంతో తేడా ఉంది.

సౌందర్యంతో — తెలివితేటల్తో — అన్నింటిలో.

చెంపల మీదుగా కారిపోయింది — కన్నీరు.



'వన్నూ...భాస్కర్'...తడబడుతూన్న పెద వులతో చిన్నగా ప్రతిబింబంతో పలికింది. తలదించుకొంది. రెండు నిముషాలు గడి చాక ఇల్లంతా కలయ జూసి భాస్కర్ వద్ద కెళ్ళింది. 'టేబిల్' పై కాళ్ళు ఎత్తి పెట్టుకొని ఏకాంతంగా కుర్చీలో కూర్చు న్నాడు. ఆకాశంలోకి శూన్యదృక్కులు బరుపుతున్నాడు.

'భాస్కర్...నాన్నగారెక్కడ?'...

విశ్వల దృష్టితో పిలిచిన వ్యక్తిని త్రుటి కాలం చూసి చూపు ప్రక్కకి తిప్పు కొన్నాడు.

'భాస్కర్ ... నాన్నకు మనస్థిమితం లేదు...జరిగిన దానికి హృదయపూర్వకంగా క్షమాపణ చెప్పుకుంటున్నాను. మా అక్కకు స్వేచ్ఛనిచ్చిన ఫలితం, ప్రత్యక్షంగా అనుభవిస్తూ — మా నాన్న మనిద్దరి స్నేహాన్ని అనుమానించటంలో అసహజ మేముంది...కాని బాధ ఏమిటంటే ఆయన ఆశయాలకు యీ ఛాయలుకూడ కన్పించటం లేదు. పూర్తిగాపిచ్చివాడయినట్లుంది' ... అంది భాను.

'నేను వారన్న మాటలకు బాధపడటం లేదు భానూ...వారిలో ఈ పరిణామాలకు కారణాలు ఆలోచిస్తున్నాను...జాతి కుల మత విచక్షణలేని ప్రేమ వివాహాలకు తను ప్రోత్సాహించేవాడు... ఆ మాటకొస్తే 'మీ అమ్మ'ను క్రైస్తవ మతస్తురాలయినప్పటికీ ఏనాటి మాట వినక పెళ్ళిచేసికొన్నాట్ట... అంటున్నారు...'

# మట్టి బొమ్మలు

'విమర్శా కెరటం తమ కాళ్లదాకా వస్తే పారిపోకుండ నిలబడేవాళ్ళు బహు కొద్ది మంది ఉంటారు భాస్కర్ ... వాళ్లలో కొందరు కెరటం ఉక్కిరి బిక్కిరి చేసి ముంచెత్తుతోంటే భయపడి పరాజితులై పోతారు'...అని

'అయినా ఆయన మనస్సు చలించటానికి గల కారణాలు తెలిసికొని మనం చేసేదేమీ లేదిప్పుడు...' అంది.

ఇద్దరూ కళ్లలో కళ్ళుపెట్టుకొని 'ఒక అరనిముషం సేపు చూసికొన్నారు ఎవరూ చూపులు మరల్చుకోలేదు.

'పోయినవారం నే నిచ్చిన 'కవరు' పంపావా ?.. మా అక్కకు'. ప్రశ్నించింది.

అతను కలవరం చెందాడు. పెదవులు చప్పరించాడు. ఆ అమ్మాయిని సంతోష పెట్టటం కోసం అబద్ధమాడాడు.

'అది కప్పట్నుంచి అడ్రస్ తెలిసికొని. ఆ రెండోరోజునే పోస్టులోవేశాను' అన్నాడు.

ఆమెముఖం వివర్ణం చెందింది. నిరాశతో అతనికి చెప్పకుండానే కాళ్ళీడ్చుకొంటూ వెళ్ళింది భాను ఎందుకలా ప్రవర్తిస్తుందో భాస్కర్‌కు అర్థంకాలేదు. మూడు సంవత్స రాలనాడు, ఇల్లువదలి వెళ్ళిన అక్కకోసం ఎందుకింత తహతహ లాడుతుందో తెలియ లేదు. ఎంత అమాకీ తీసినా, లేచిపోయిన ఆమెను గూర్చి వివరికీ ఏ సమాచారం తెలియలేదు.



ఆరోజు సాయంత్రం వరకూ కామేశ్వరి మాష్టారు రాలేదు. ఎవరూ ఆయన్ను వెదక టానికై ఉత్సాహం కనపరచలేదు. భాను దిగులుపడి ఏ అఘాయిత్యానికి పాల్పడు తుందో. అసలే సునిశిత హృదయం కల్గిన దని భాస్కర్ సాయంత్రం ప్రేమతో పరా మర్శించాడు.

అయితే రెండోరోజు ఉదయాన పాలేరు వెంకన్న గసబోసికొంటూ వచ్చి 'పంతులు గారి చిన్నకూతురు ... పంతులుగారి చిన్న కూతురు'. అని మాట పూర్తి చెయ్యలేక పోతూన్న వాడి మాటవిని భాస్కర్ ప్రక్క ఇంటిలోకి పరుగెత్తాడు.

ఉరిపోసికొని భాను వ్రేలాడుతోంది. కళ్ళు నాలుక కొద్దిగా బయటికొచ్చి వికృ తంగా ఉంది. చూడలేక భాస్కర్ ముఖానికి రుమాలు అడ్డం పెట్టుకొన్నాడు. క్షణంలో ఈ వార్త ఊరంతా పాకిపోయింది మాష్టా రిపై ప్రేమాభిమానాలున్న నల్గురికి సైకిళ్ళిచ్చి ప్రక్కఊళ్ళకు పంపారు — మాష్టారికోసం — కొందరు పట్నంపోయి గాలించారు. జాడ కన్పించలేదు. పోస్టు మార్టం జరిగింది.

మూడవరోజు ఉదయం వరకూ మాష్టారి కోసం ఎదురుచూసి, శవానికి దహనక్రియలు జరిపారు. అభిమానులూ, విద్యార్థులూ గౌర వంతో శవపేటికను శ్మశాన వాటికకు మోశారు.

'నీతిగల పిల్లని — మర్యాదగల్గిన పిల్లని' అందరూ హర్షించారు.

'హా' అనే వాళ్ళులేకుండ ఇలా దిక్కులేని చావు చచ్చిపోయిన భాను శరీరాన్ని అగ్ని జ్వాలలు తాకుతోంటే భరించలేక ముఖం తిప్పుకొని ఇంటిదారి పట్టాడు భాస్కర్. బల్లకు తలఆన్చి భోరునఏడ్చాడు భాస్కర్.

సాయంత్రం నాల్గు గంటలకు తల పైకెత్తాడు. బల్లమీదున్న పుస్తకాల మధ్య నున్న 'కవరు' అతని దృష్టి నాకర్షించింది. అది 'భాను' తన అక్కకు పంపమని తన కిచ్చిన కవరు. అనాలోచితంగా చించి చదువ సాగాడు.

ప్రియమైన అక్క. .శారదకు...

మూడు సంవత్సరాలనుండి నీవు — నన్నూ ... నాన్ననూ చూడటానికి ఒక్క సారైనా వస్తావని ఎంతో ఆశతో ఎదురుచూశాను, కాని తీసుకురాలేదు నాలాటి నిర్భాగ్యురాలిని

**మరచిపోవటమే మంచిది. ఈ పుడమిపై** మానవులుగా జన్మెత్తుతారు కొందరు. ప్రపంచంలో వాళ్ళ అవసరమేమిటో, వాళ్ళ బ్రతుకుతో ఎవరికి నిమిత్తమో అర్థంకాదు, అలాటి వారిలో నేనొకతెను నాకు ప్రేమించి ఆదరించే ప్రేమికుడూ లేడు — ప్రేమించక పోయినా పెండ్లిచేసుకొని నా సేవల నందుకొనే భర్తా లేడు నన్ను చూసి 'అణకువకల్గిన పిల్ల — నెమ్మదిగా ఉంటుంద'ని అందరూ అభినందిస్తూంటారు నీవు చేసిన పనిని దృష్టిలో పెట్టుకొని నన్ను మరింత పొగడేస్తుంటారు కాని ఎవరూ ముందుకొచ్చి నన్ను వివాహంచేసికోరు—

కారణమేమంటే నీకు చెల్లిగా, నాన్నకు కూతురుగా పుట్టటమే నేను చేసిన పాపం వర్ణాంతర వివాహంవలన ఇద్దరాడపిల్లల తండ్రినౌతానని నాన్నకు ముందుగా తెలిసుంటే ఈ ఆశయాలకు దూరంగా ఉండేవాడే మరో ముఖ్యవిషయమేమంటే నాన్న వద్ద డబ్బులేదు - ఎవరైనా డబ్బుకాశించి నన్ను కట్టుకోటానికి రూపంలేక - చదువులేక, కట్నం లేకపోతే, ఏ అర్హతచూసి నన్ను పరిగ్రహిస్తారు.

నీవు అలా లేచిపోవటం నాన్నకు దుస్సహమైంది. ఊరంతా మీ ఇద్దరి సంబంధాన్ని నాన్న ప్రోత్సహించాడని మన

# మట్టిబొమ్మలు

ఇంటిమీదికొచ్చారు ఆ అసత్యపు అర్థవిహీన ప్రేలాపనలముందు నాన్న తలదించుకొన్నాడు అవమానంతో కృశించి పక్షవాతం తెచ్చుకున్నాడు. ఒక కాలూ — చెయ్యిపడిపోయ్యాయి జీవితాలను హృదయాలనూ సంకుచితపరిచే జాతి నీతిమతాలతో పెనవేసికొన్న సాంఘిక దురాచారాలను రూపుమాపి మరో పవిత్రమైన మమతా బంధాలకు తావివ్వాలని చాటిన 'నాన్న' నీవు చేసిన పనిని హర్షించలేక ఆయన బాటనుండి తిరోగమించాడు.

నాన్న— ఎంతగా దిగజారిపొయ్యాడంటే — నన్ను పెళ్లిచేసుకోనన్న కారణంగా, 'ప్రసాద్'ను ఇంట్లోనుంచి తరిమివేశాడు

సమాజం అవినీతిపరులుగా — చరిత్రహీనులుగా పరిగణిస్తుందని భయపడి మీరా విధంగా సాహసించకపోతే మీరిద్దరూ యావజ్జీవనరకం అనుభవించేవారే నాకా ధైర్యంలేదు — నైతిక విలువలను, భేదించుకొని బయటపడే సాహసం నాలో లేదు నేను పిరికిదానను. చిన్నతనంలో నేనూ, భాస్కర్ ఎలా ఆడుకొనేవాళ్లమో, నీకు తెలియనిది కాదు — కానీ ఇప్పుడు 'భాస్కర్'ను కన్నెత్తి చూడాలంటే కంపించి




**పోతాను. అందువల్లనే అందరిచే పొగడ**బడతాను

భాస్కర్ మేము చదువుకొన్న రోజుల్లో మాదిరిగనే ఇప్పటికీ నన్ను ప్రేమతో చూస్తుంటాడు కానీ అది ప్రేమకాదు. నా దుస్థితిని చూసి జాలిపడటం. అంతకు మినహా ఏమీలేదు ఇదీ నా బ్రతుకు — తల్లి లేదు అక్కలేదు తండ్రికి భారమైపొయ్యాను జీవితంలో రేపు అనే ఆశ, అంధవిశ్వాసం లేనప్పుడు బ్రతకటంలో అర్థంలేదు. నిన్ను — బావను ఒక్కసారి చూడాలనిపిస్తుంది. వారంరోజులవరకూ ఎదురు చూస్తుంటాను.

ఇట్లు,
నీ చెల్లి - భాను.

భాస్కర్ కన్నీటిబొట్లు ఉత్తరంపై వ్రాలి అక్షరాలను చెరిపాయి

'నాకు నీపట్ల జాలి మినహా ఏమీలేదా? భాను' అంటూ డాబామీదికి పరుగెత్తాడు. ఊరిబయట శ్మశానంలో 'భాను' భౌతికదేహానికి చిహ్నంగా, మిణుకు మిణుకు మంటున్న బూడిదకుప్ప సమాధానం చెప్పలేదు.

*　　*　　*

'భాను' విశ్వసౌందర్యంలో విలీనమై వారంరోజులు గడిచిపోయింది. ఆ ఇంటి నుండి ఈ ఇంటికీ—ఈ ఇంటిలోనుండి ఆ ఇంటిలోకి 'పిన్నీ- పిన్నీ' అంటూ రాలుగాయిలా మాట్లాడుతూ పచ్చపచ్చగా తిరిగే ఆ అమ్మాయి వాళ్ళకంటికి కరువైపోయింది. కోటయ్య తన కన్నకూతురు పోయినట్లు వారంరోజులు మంచం పట్టాడు ఇక భాస్కర్ తల్లి —సీతారామమ్మ — గొంతులో పచ్చి మంచినీళ్లు కారనివ్వకుండ చిక్కి సగమైపోయింది భాస్కర్ ఇంటిపట్టున ఉండకుండ పొద్దున్నేలేచి ఎటో చెట్టూ గుట్టా పట్టుకొని తిరిగి తిరిగి రాత్రికి ఇల్లు చేరేవాడు.

ఈవేళనే దైనందిక కార్యక్రమాలు మళ్లీ యధాతథంగా మొదలయ్యాయి.

పొద్దు తూలిపోయింది సాయంత్రం మూడుగంటలుదాటి కొద్దిగా చల్లబడింది.

కోటయ్య నులకమంచంపై కూర్చొని చుట్ట కాల్చుకొంటూ తాపీగా మాట్లాడుతున్నాడు

'మనం అనుకొంటాంగానీ...సంతులు

గారికి పెద్దమ్మాయంటేనే ఎక్కువ ఇది... ఇప్పటికీ ఆ పిల్ల పేరెత్తితే 'కస్సు' మని మనమీద విరుచుకుపడేవాడు కానీ లోలోపల పెదమ్మాయిమీదనే ప్రాణం లా గుద్ది. పాపం. ఎటుపోయ్యాడో. ఏమయ్యాడో'.. మాట్లాడటం ఆపి ముందుకు వంగి ఉమ్మివేశాడు.

'ఆ.. పెద్దమ్మాయి కాకపోతే ఎర్రగా బుర్రగా ఉంటదన్న మాటేగానీ చిన్నమ్మాయితో సాటి చేస్తుందా?. ఎంత కలుపుగోలుతనం ఎంత చొరవ ఎప్పుడైనా— 'మీరు'-'మేము' అన్న ప్రాపాన పోలేదు గదా?. 'మనమే-మనం'... ఎప్పుడూ గలగలమని నవ్వుతూ ముద్దబంతి పువ్వులా ఉండేది నేను జడవేస్తే ఎంత సంభరమో? .. కానీ మాటంటే మాత్రం పడదు. ఎంతరోషం ఎంతరోషం? పాపం వచ్చియాడుందోగానీ తల్లి ఏ పని చేసుకొందామన్నా కాలూ చెయ్యీ, ఆడనియ్యకుండ అడ్డమొస్తుంది కళ్లల్లోనే తిరుగుతోందీ' ...ఆమె ముంజేతితో కళ్లు తుడుచుకొంటూ అంది

అరుగుపై కూర్చుని బజారుకేసి చూస్తున్న భాస్కర్ ఒక చెవితో తల్లిదండ్రుల మాటలు ఆలకించసాగాడు

కోటయ్య చుట్ట నోటిలో పెట్టుకొని ఒక గుక్క లాగి అలానే నోరు తెరిచాడు వీధిలోకి చూస్తూ— తన కళ్లను తనే నమ్మలేనట్లు చూడసాగాడు.

'ఒరేయ్ అబ్బాయ్...ఆ వచ్చేది అచ్చమ్మగారు కదూ,'.. ఆశ్చర్యంగా అన్నాడు.

'ఆ ఆ ఆమె' భాస్కర్ నిర్లక్ష్యంగా సమాధాన మిచ్చాడు కోటయ్య సంశయం తీర్చుకొనేలోపునే— ఆమె రానే వచ్చింది తలమీద వేసికొన్నముసుగు తీసికొంది 'ఉస్సు' రంటూ

ముఖం పాలిపోయింది.

కొడుకుపై దిగులుతో మనిషి బాగా కృంగిపోయినట్లు కనిపించింది.

'అచ్చమ్మగారూ?'.. కోటయ్య లేచి నిలబడ్డాడు

'ఏందీ? ఇంత ఎండనపడివచ్చావ్? కొత్తచాలాక రాకూడదా? లేకపోతె పొద్దున్నే రాకూడదా? ఆ చివరనుండ ఈ చివరకు .. అయ్యయ్యో అంత అవసరంపడితె నన్ను రమ్మని కబురు పెట్టకూడదూ? ఇంకా' అంటూ కోటయ్య ముక్కాలిపీట వేశాడు,

'ఏమిటి ..దారి తప్పివచ్చినట్టుందే మా ఇంటికి'...పంచనీడలో కూర్చొని—పిడకల కొరకై పేడ వరిపొట్టులో పిసికి కలుపుతున్నదల్లా హడావుడిగా చేతులు కడుక్కొని వచ్చింది. అచ్చమ్మలాటి వ్యక్తి అలా కాలినడకన విచ్చేసిందంటే తమ ఇంటికి అదొక మహాభాగ్యంగా భావించుకొంది ఆ ఇల్లాలు

'ఆఁ. ఎప్పుడో వద్దామని ఒయల్దేరాను గడప దిగి బజార్లో అడుగు పెట్టానో, లేదో, వాడు వీరాయ్ వచ్చి శివరామయ్య కోడెలు పొయ్యాయంటే. వాడ్ని పల్కరించి పద్దామని అటు పొయ్యేసరికి ఈ వేళయింది'...

'ఏమిటీ ..పొయ్యాయా!'...ఆమె కళ్లు ఇంతింతలు చేసికొంటూ అడిగింది.

'ఆ. మూడువేల రూపాయల ఖరీదు చేసే పందెపు గిత్తలు— ఈగ వాలితే జారిపొయ్యేలా మిసమిసలాడుతూన్న కోడెలు ... నిన్న పొలం దున్నుతూ— దున్నుతూ మెడలు విరుచుకొని అడ్డం బడిపొయ్యాయి - పురుగు ముట్టిందన్నారు — దబ్బనం కాల్చి వాతలేశారు ఎన్ని చేసినా కోడెలు మాత్రం తగ్గలేమ'... దిగులుగా పలికింది అచ్చమ్మగారు.

(ఇంకా ఉంది)

**విలియం మాంచెస్టర్**

# అధ్యక్షుని మరణం

## 19

లిండన్ జాన్సన్ వీలయినంత త్వరలో శాసనసభల సంయుక్త సమావేశంలో ఉపన్యాసం ఇవ్వాలని ఇష్టపడ్డాడు. ఇందులో ఆశ్చర్యంలేదు. ఈ విధంగా కలవరపడిన దేశానికి కొంత ధైర్యం కలగవచ్చు. అందుకనే, ముందు మంత్రివర్గంతో సమావేశం ఏర్పరుచుకున్నాడు. అందరిలోనూ 'కెన్నెడీకన్నా నాకు మీ సహకారం, సహాయం అవసరం' అన్నాడు.

ఈ సమావేశంలో ఎట్టార్నీ జనరల్ పాత్ర కొన్ని చిక్కులతో కూడుకొని ఉన్న పాత్ర. అతను చనిపోయిన అధ్యక్షుడి తమ్ముడు; అతనిని బాగా పోలినవాడు; చాలా అప్తుడు; కెన్నెడీ బతికిఉన్నప్పుడు చాలా పలుకుబడి కలిగినవాడు. జాన్సన్‌కీ ఇతనికీ మధ్య చికాకులు ఏర్పడటానికి చాలా అవకాశాలు ఉన్నాయి. వాటిని పెంపొందించేందుకు సిద్ధంగా ఉన్న వ్యక్తులు ఉన్నారు. వీటన్నిటికీతోడు బాబ్ కెన్నెడీ అన్నగారి అంత్యక్రియల ఏర్పాట్లలో మునిగిఉన్నాడు. అనుకోకుండా ఈ సమావేశానికి వచ్చాడు - తన అన్న కుర్చీ ఒకటి అక్కడే ఉందేమోనని దానిని కూడా పంపించివెయ్యటానికి వచ్చాడు. బండీ అతన్ని ఉండిపొమ్మన్నాడు. ఫోటోలు తియ్యకుండాఉంటే ఉంటానన్నాడు బాబీ కెన్నెడీ. కష్టమని తోచినా జాన్సన్ అంగీకరించాడు.

బాబీ సమావేశం జరిగే గదిలోకి రాగానే ఎందరో లేచినుంచున్నారు. ఒక వ్యక్తి అతని చెయ్యిపట్టుకుని వీపుమీద చరిచాడు. బాబీ కెన్నెడీ మౌనంగా కూర్చున్నాడు. అతని పదవిలో ఉన్న మనిషి మౌనం కూడా ముఖ్యమయినదే. కొందరు రాజకీయాల వ్యాఖ్యాతలు 'బాబీ రాజీనామా ఇస్తా'డనటం ప్రారంభించారు. దేశం మొత్తంమీద లక్షల మంది అతని భవిష్యత్తు గురించి చర్చిస్తున్నారు. ముభావంగా ఉన్న అతని వైఖరిని ఎందరో గమనించారు—జాన్సన్ ప్రత్యేకంగా.

ఒక్కొక్కరూ లేచి కొత్త అధ్యక్షుడి పట్ల తమ విశ్వాసాన్ని ప్రకటించారు. రాజీనామాల విషయమయి కొంత చర్చ జరిగింది. తర్వాత సమావేశం అంతం అయింది. దీని వల్ల సాధించింది ఏమిటి? ఎంతో లేదని అందరూ అనుకున్నారు. జాన్సన్ నిరాశ చెందినట్లు కనిపించాడు. బండీ, 'సమావేశం చాలా సంసార పక్షంగా ఉం'దన్నాడుట. జాన్సన్ మెతకగా ఉన్నాడనీ, మరి కొంత అధికారం ప్రదర్శించాలనీ కొందరు అన్నారు.

ఈ సలహాని అందివ్వటానికి క్లిఫ్ కార్టర్ అనే అతను జాన్సన్ దగ్గిరికి వెళ్లాడు. కాని, అప్పటికే జాన్సన్ ధోరణిలో చాలా మార్పు వచ్చేసింది! జంకు తగ్గి ధీమా వచ్చింది కార్టర్‌తో ఎట్టార్నీ జనరల్ సంగతి చెప్పాడుట. (ఇదంతా కార్టర్ తన డయిరీలలో రాసుకున్నాడు.) 'జాకీ చాలా మంచిది. త్వరలో ఇల్లు ఖాళీ చేస్తానంది కాని నేనే, 'కావలసినన్ని రోజులు ఉండు! నేనున్న ఇల్లు బాగానే ఉంది నాకేమిటి తొందర? నీకు కలిగిన ఘోరమయిన నష్టంవల్ల ఎన్నో సమస్యలు వస్తాయి.' 'అన్నాను' అని చెప్పాడు జాన్సన్. తన 'అసలు సమస్యలు' 'బాబ్'తోనే అని సూచించాడు. తనని అవమాన పరచటానికి ప్రయత్నిస్తున్నట్లు తన అభిప్రాయం వెలిబుచ్చాడు. కావాలనే సమావేశానికి ఆలస్యంగా వచ్చాడని జాన్సన్ ఊహ. (ఇది విన్న బాబ్ కెన్నెడీ తన ఆశ్చర్యాన్ని ప్రకటించాడు, తర్వాత ఎప్పుడో.)

ఈ ఊహ సరయినది కాకపోవచ్చు. కాని, లిండన్ జాన్సన్—బాబ్ కెన్నెడీల పరస్పర సంబంధాలు అలా ఉన్నాయి. అసలు అవి 1960 నుంచే సరిగ్గా లేవు. ఒకసారి (1960 లో) జాన్సన్ లాస్ ఏంజలిస్ పట్నంలో మాట్లాడుతూ జోసెఫ్ కెన్నెడీని విమర్శించాడు. ఈ విమర్శని బాబీ ఇంకా మనస్సులో ఉంచుకున్నాడని జాన్సన్ అనుమానం. (నిజానికి ఈ విమర్శగురించి బాబీ కెన్నెడీకి తెలియనే తెలియదు!) అంతే కాక, రెండు పక్షాలు లేక వర్గాలు ఏర్పడిపోయాయి. వీరిమధ్య విరోధాలు తేలికగా పెంపొంది పోయాయి. కేవలం వ్యక్తిత్వాల విభేదాలవల్లనే ఈ విరోధాలు వచ్చాయి, అనటానికి వీలులేదు. కెన్నెడీ జాన్సన్‌ల వ్యక్తిత్వాలు వేరు కాని వారిద్దరి మధ్యా ఈ విరోధం రాలేదు.

కారణం ఏదయినా బాబ్ కెన్నెడీ, లిండన్ జాన్సన్‌కి పొత్తు కుదరలేదు అని మాత్రం చెప్పవచ్చు. కొత్త అధ్యక్షుడికి బాబ్ కెన్నెడీ పెద్ద అవరోధంగా కనిపించాడు.

* * *

కొత్త అధ్యక్షుడికి జాన్ ఎఫ్. కెన్నెడీ ఇల్లు తీసుకోవాలని లేదు. పాత ఇంట్లోనే ఉండిపోతానన్నాడు. అధ్యక్షుడి ఆఫీసుగది మాత్రం వాడటానికి కావాలని జాన్సన్ కోరాడు. ఈ విషయమయి ఎందరికో ఎన్నో అనుమానాలు వచ్చాయి. ఒక అధికారి చనిపోతే అతని ఆసనాన్ని తర్వాతివాడు ఆక్రమించటం సహజం, అవసరం అంటూనే కనీసం జాన్. ఎఫ్. కెన్నెడీ దేహం వెళ్లిపోయేదాకా ఆగటం మంచిదని కెన్నెడీ బావ సార్జెంట్ ష్రీవర్ అన్నాడు. జాన్సన్ ఆఫీసు విషయం మళ్లీ కదపలేదు.

* * *

ఇక శాసనసభల సమావేశంలో ఉపన్యాసం మిగిలింది. జాన్సన్, 'వీరిల్లా అంటున్నారు. వారల్లా అంటున్నారు.' అనటం ప్రారంభించాడు. కొత్త అధ్యక్షుడు తన అధికారాన్ని ప్రదర్శించటం అవసరం అని కొందరు సలహా ఇచ్చారు. మంగళవారానికి ఉపన్యాసం ఏర్పాటు చెయ్యాలనుకున్నారు.

బాబీతో ఈ సంగతి చెప్పాడు, బండీ.

'నాకేమీ బాగాలేదు! అంత్యక్రియలు అయిన తర్వాత ఒకరోజయినా ఆగితే బాగుంటుంది,' అన్నాడు ఎట్టార్నీ జనరల్.

'వారందరూ' ఇలా అంటున్నారు',

అన్నాడు బంఢీ.

'అయితే నన్నెందుకు అడగటం,' అని విసుక్కున్నాడు బాబీ కెన్నెడీ. 'మీ ఇష్టం వచ్చినట్లే చేసి తగలడండ!'

ఇంతలో ఫ్రీవర్ కూడా వచ్చాడు. బండీ ముందువచ్చి ఈ విషయంగురించి మాట్లాడి పోతున్నట్టు అతనికి తెలియదు. జాన్సన్ ఇలా రాయబారాలు పంపటం రాబర్ట్ కెన్నెడీకి నచ్చలేదు. 'నన్నడగమని వాళ్ళతో చెప్తా డెందుకు? నన్ను నరుకుతున్నాడంటే! బుధవారందాకా ఆగితే మంచిదని నా అభిప్రాయం—అది అతనికి తెలుసు!' అన్నాడు ఫ్రీవర్ ఈ సంగతి జాన్సన్‌తో చెప్పాడు. జాన్సన్ వెంటనే బుధవారానికి ఏర్పాట్లు చెయ్యమని ఉత్తరువులు జారీచేశాడు కొందరికి త్వరలో ఈ నిర్ణయం దేశమంతటా ప్రసారం అయింది. దాని వెనక ఎంత కథ వుందో ఎందరికో తెలియదు.

ప్రభుత్వ నిర్వహణలో లోట్లు, ఆలస్యం ఉండరాదని జాన్సన్ అభిప్రాయానికీ కెన్నెడీ మరణం విచారంలో మునిగిఉన్న ఎందరో ప్రముఖుల విచారానికీ పొత్తు కుదరలేదు.

ఇంటికి తిరిగి వెళ్ళిపోయేముందు జాన్సన్ టెడ్ సొరెన్సన్‌ని పిలిపించాడు. 'ఈ హత్యతో విదేశీ ప్రభుత్వం జోక్యం ఉందంటారా?' అని అడిగాడు.

'అటువంటి సాక్ష్యం ఏదయినా దొరికిందా?' అని ఎదురు ప్రశ్న వేశాడు సొరెన్సన్.

స్నేహితులు అనతగని ఒక రాజ్యంలో కొందరు కెన్నెడీ మరణాన్ని కోరుతున్నట్లు ఎప్పుడో ఎఫ్ బి అయ్. ఇచ్చిన రిపోర్టు ఒకటి చూపించాడు జాన్సన్. ఆ రిపోర్టు చాలా అవకతవకగా ఉంది.

'అర్థంలేనిది,' అన్నాడు సొరెన్సన్.

అంత్యక్రియలు జరిగినప్పుడు తనకి ప్రత్యేకరక్షణ అవసరం ఉంటుందా అని అడిగాడు జాన్సన్. సొరెన్సన్ అక్కర్లేదని చెప్పాడు

కెన్నెడీ సేకరించిన పరిపాలకుల 'జట్టు' అతనికే సరిపోయింది. ఈ జట్టు సభ్యుల వ్యక్తిత్వాలకీ కెన్నెడీ వ్యక్తిత్వానికీ పొత్తు కుదిరింది. జాన్సన్ విషయమే వేరు. ఈ సంగతి జాన్సన్‌కి తెలుసు. అందుకనే, క్రమంగా తనకితోచిన మార్పులు చేసుకున్నాడు. (ఇంకా వుంది)

మీకు తెలుసా? క్రొత్త పరిశ్రమలు నెల-కొల్పుటకు చక్కని ప్లానులుండి, పరిజ్ఞానముండి, సమర్థంగా నడుపుటకు శక్తియుండి, కావలసిన మూలధనములేని ఉద్యోగపతులకు స్టేట్ బ్యాంక్ ఇప్పుడు ఋణాలు ఇస్తున్నదని?



# యుక్తమైన ప్లాను మీదగ్గరుంటే, యీరోజే మమ్ములను కలుసుకోండి. ఆలసించవద్దు.

## స్టేట్ బ్యాంక్ సేవనిమిత్తం



# ప్రేమించిన పెళ్ళికొడుకు

ఎస్. అనంతలక్ష్మి

'పోస్ట్' వాకిట్లోంచి పోస్ట్‌మేన్ గావు కేక పెట్టాడు. ఊడిపోయిన చీరగోచి సరిగ్గా పెట్టుకుంటూ గబగబా వాకిట్లోకి వచ్చింది శారదమ్మ. పోస్ట్‌మేన్ అందించిన కవరు అందుకుని వంటింట్లోకి వెళ్ళింది. పీట మీద కూచుని కవరు విప్పింది తాపీగా,

'డియర్ ఉషా కాంతి!'

తమరి దర్శనం అయి చాలా రోజులైంది. రోజూ పబ్లిక్ గార్డెన్స్ అంతా యీమూల నుంచి ఆ మూలకి తిరగలేక ఛస్తున్నాను. కాలేజిలో కలుద్దామంటే మా ఆఫీస్‌నుంచి నీ కాలేజికి వచ్చేసరికి ఆ టైమ్‌కి ఉషమ్మ గారు నెమ్మదిగా యిల్లుచేరుకుని ఉంటారు. అప్పుడప్పుడు కాలేజినుంచి చల్లని గాలి కోసం పబ్లిక్ గార్డెన్స్‌కి వచ్చేస్తావు కదా వెలుతోటి అని వారంరోజుల్నుంచి పబ్లిక్ గార్డెన్స్‌లో పడిగాపులు కాస్తున్నాను. ఉహూఁ, అయినా దేవిగారి దయ కలుగలేదు. అయినా నేనెందుకు గుర్తుంటాలే యింక నీకు. నా కన్నా బాగా కబుర్లుచెప్పి నిన్ను బుట్టలో వేసుకునే ఆ మధో — మధురివో దొరికిందిగా, అయినా మనం యిలా కల్సుకోవటం కుదిరేటప్పటికి నీకో నాకో పిల్లలు కూడా పుట్టచ్చనుకుంటాను. ఏమంటావు ఉషా, అందుకని ఓ ఉషారాణీ గారూ, రేపుమేట్నీ షోకి సాగర్‌లో కలుసుకోండి. తప్పకుండా వస్తావుకదూ. నీతో బోల్డు కబుర్లూ — కాకరకాయలు, విషయాలూ-విశేషాలుచెప్పాలి. అందుకని రేపు సాగర్‌కి మర్చిపోకుండారా, నిన్ను రేపు సాగర్‌లో కలుసుకుంటానని కలలు కంటూ నీ కోసం ఎదురు చూసే

నీ

రాధ.

ఉత్తరం ఆద్యంతం చదివి రేడియో క్రింద పెట్టి వంటపనిలో మునిగిపోయింది శారదమ్మ.

సాయంత్రం అయిపోయింది. ఉస్సూరుమని వేలాడుకుంటూ వచ్చింది ఉష పుస్తకాలు టేబుల్‌మీద పడేసి బాత్‌రూంలోకివెళ్ళి కాళ్ళూ —చేతులూ కడుక్కుని వంటింట్లోకి వెళ్ళింది. ఉషనిచూసి వాసంతి టిఫిన్ ప్లేట్‌లో పెట్టి ఉష ముందుకినెట్టి 'అయ్యో, అయ్యో ఏం దారుణం. ఏమిటమ్మాయ్. కాలేజీ చదువు వెలగబెడుతున్న భాగ్యానికే మొహం అలా వాడిపోయిందేం, ఉద్యోగం చేస్తానంటున్నావు మరి, అప్పుడెలా ఉంటుందో అమ్మాయిగారి మొహం చూసి తీరాల్సిందే మరి' అంటూ నవ్వింది.

'అఘోరించినట్లు ఉంది తెలివి: ఆఫీస్‌లలో ఆడపిల్లలు పన్చెయ్యరటగా. నువ్వు మేగజైనులలో విట్స్ చూడడంలా హాయిగా 9 30 ని.కి అన్నం తిని ఆఫీస్‌కి వెళ్ళటం, దారిలో ఏ లైబ్రరీలోనన్నా రెండు నవలలు తీసుకొని, ఆఫీస్‌కి వెళ్ళటం, హాయిగా కుర్చీలో కూర్చుని టేబుల్‌మీద కాళ్ళు బారచాపుకుని చదివినంతసేపు చదవటం, నిద్రపోయినంతసేపు నిద్రపోవడం, యీ మధ్యలో ఏ ఆఫీసరన్నా చెకింగ్‌కి వస్తే వాడి మొహాన ఒక చిరునవ్వు పడెయ్యడం, 5 గం.లు అవగానే కుర్చీలోంచి లేచి నిద్ర

మొహం కన్పించకుండా కర్చీఫ్ కాస్త నీళ్లలోముంచి మొహం తుడుచుకుని కాస్త లైట్‌గా కోటాకొట్టుకుని నీట్‌గా బయటికి వచ్చెయ్యడం, బస్‌లో సీట్ లేకపోతే ఎవడి మొహాన్నా స్వీట్‌గా చిరునవ్వు పారెయ్యడం, దాంతో వాడు ఐస్సైపోయి 'మేడమ్ యిలా కూచోండి' అంటూ ఆ ఫూల్ నిలబడటం, హాయిగా యింటికివచ్చి కడుపునిండా భోజనంచేసి కమ్మని కలలుకంటూ నిద్ర పోవటం యిందులో కష్టం ఏముందీ ? యిప్పుడు చూడు మరి. కాలేజికి వెళ్లాలీ, లెక్చరర్స్ చెప్పేది వినాలీ, వినేది అండర్ స్టాండ్ చేసుకోవాలీ, నోట్సులు రాయాలీ, రికార్డులు రాయాలీ ఆ రాసిన వాటిమీద లెక్చరర్స్‌చేత సంతకం చేయించాలీ, గేమ్స్ టైమ్‌లో గేమ్స్ ఆడాలీ, ఎన్. సి. సి. లో మార్చింగ్ చెయ్యాలీ, యీ కష్టాలు చాల వన్నట్టు అప్పుడప్పుడు లెక్చరర్స్‌పెట్టే ప్రైవేట్ క్లాసులకి హాజరుకావాలీ, అయ్యో వదినా, యీ కష్టం ఎంతలా చెప్తే నీ కర్థం అవుతుంది వదినా' ఉస్సూరుమంది ఉష. నవ్వాపుకోలేక అవస్త పడింది వాసంతి.

'సర్లే! చాలా కష్టపడ్డావు కానీ ఉదయం నీకో ఉత్తరం వచ్చింది చూడు. రేడియో కిందపెట్టాను అంటూ పెరట్లోంచి వచ్చింది శారదమ్మ.

ఉత్తరం అనగానే టిఫిన్ అదరాబాదరా తినేసి కాఫీ తాగకుండా హాల్లోకి పరిగెత్తింది ఉష. 'ఎవరే అమ్మాయ్! ఆ రాధ మనింటికి ఎప్పుడన్నా వచ్చిందా' అంటూ ఉష వెనకాలే కాఫీ కప్పు తీసుకుని వచ్చింది శారదమ్మ. ఉత్తరం చదివిన ఉష ఒక నిముషం తెల్లబోయి తర్వాత తమాయించుకుని రాధ చిలిపితనానికి నవ్వుకుంది. నవ్వుకుంటున్న కూతురుని చూసి 'ఎందుకే! అంత నవ్వు వస్తోంది. ముందు కాఫీతాగు. చల్లారిపోతోంది ...'అంటూ కాఫీ కప్ చేతికిచ్చింది శారదమ్మ.

కాఫీ అందుకుని తాగుతూ 'చూడు. ఉత్తరం ఎంత చిలిపిగా రాసిందో. చదువుతుంటే నవ్వు వచ్చింది' అంది ఉష 'అది సరేకానీ, ఆ అమ్మాయికి మనిల్లు తెలీదేమిటీ సినిమా హాల్లో కలుసుకోమని రాసిందీ' అంది శారదమ్మ.

'తెలీదమ్మా! వాళ్లిల్లు నాకు తెలియదు. మనిల్లు ఆమెకి తెలియదు పాపం! చాలా మంచిదమ్మా. తండ్రి లేడట. ఇక్కడ ఉద్యోగం చేస్తోంది.'

'అలాగా, అయితే రేపు మనింటికి రమ్మని చెప్పు ఒక్కసారి' అంటూ లోపలికి వెళ్లిపోయింది శారదమ్మ ఉష నవ్వుకుంటూ వీక్లీలు తీసుకుని డాబా మీదికి వెళ్లింది. యింట్లో పని అయినందు వలన వాసంతి కూడా జాజిపూలు తీసుకుని డాబామీదకి వచ్చింది.

'ఓయ్ బాబోయ్' అదంతా చదువే, ఇంత శ్రద్ధ క్లాస్ బుక్స్‌మీద ఉంటే బాగుండు. రేపు ఏ సినిమాకి ఉషా, నేను కూడా వస్తాను' అంది పూలు కడుతూ వాసంతి.

ఉష గుండెల్లో రాయిపడింది. అయినా వెంటనే తేరుకుని, 'నేను కాలేజీ నుంచి వెళ్లిపోతాగా వదినా, రేపు ఆదివారం మనిద్దరం కలిసివెడదాం' అంది ఉష జాజిపూవుని వాసన చూస్తూ.

'సరేలే' అంటూ మాలను తుంచి ఉష జడలలో పెట్టి తనుకూడా పెట్టుకుంది వాసంతి.

'ఓ వాసూ, ఎక్కడున్నావ్' అంటూ పెద్దగా అరుస్తూ పైకి వచ్చాడు శేఖర్. 'ఇష్టాగోష్టి కార్యక్రమంలో మునిగిపోయారే వదినా మరదళ్లు. భోజనాలకి టైమ్ అయిందిట దొరసానులను అమ్మ రమ్మంటుంది'. 'మీరు వచ్చి ఎంతసేపైంది. రా ఉషా పోదాం, మీ అన్నయ్య వస్తే ఎనిమిది గంటలూ తంగున కొట్టినట్లే. కింద అత్తగారు ఎదురు చూస్తూ ఉంటారు. నేను పోతున్నాను' అంటూ దిగిపోయింది వాసంతి.

భోజనంచేసి చదువుకుందామని పుస్తకం తెరిచింది ఉష. 'నీకూ నాకూ సంబంధం లేదు నేను నీతో కలవను' అంటూ ఉష మనసు కళ్లెంలేని గుర్రంలాగా ఎక్కడో దూరతీరాలకు పరిగెత్తింది. 'రేపు రాధతో ఎలా మాట్లాడాలీ తను అసలే చిలిపి. ఉత్తరంలో ధోరణి చూస్తే యీ పదిహేను రోజుల్లోను యింకో డోస్ ఎక్కువైనట్లుంది.

'ఏమిటమ్మా నీ చదువూ, నువ్వూను. 9 గం.లకి యీ గదిలోకివచ్చి యీ కుర్చీలో కూర్చున్నాను. ఇప్పుడు పది అయింది. నీవు నన్ను గమనించలేదు, నీ చెయ్యి ఆ పేజీని తిరగవెయ్యలేదు. నీ కళ్లు ఒక్క అక్షరం ముక్క కూడా చూడలేదు. పోనీ నిద్రపోతున్నావా అంటే కళ్లేమో పత్తికాయల్లాగా విచ్చుకునే ఉన్నాయి. లే 'లే' కరెంట్ దండగ. ఏదో స్వప్నలోకంలో విహరిస్తుంటే ఫాన్ దండగకూడా ఎందుకు? యీ మధ్య ఏదైనా ప్రేమాయణంలో పడ్డావా ఏమిటి ఖర్మ' అంటూ గలగలా మాట్లాడుతున్న వాసంతి మాటలకు ఉలిక్కిపడి యీ లోకంలోకి వచ్చింది ఉష.

వదిన మొహంలోకి సూటిగా చూడలేక 'తలనొప్పిగా ఉంది వదినా' అంటూ పక్కమీదకు చేరింది.

తెల్లవారింది. యధాప్రకారం తన వేడికిరణాలతో ఉషని వేడివేడిగా సత్కరించాడు ఉషా కాంతుడు. కిటికీలోంచి మొహాన ఎండ పడడంతో ఉషకి మెలకువ వచ్చి కనులువిప్పి అలవాటు ప్రకారం పక్కకి చూసింది. టేబుల్‌మీద గడియారం 8–30 ని॥ లు చూపిస్తోంది. అయ్య బాబోయ్, యీ రోజు కాలేజికి లేట్ అయ్యేటట్లు ఉంది' అని అనుకుంటూ బాత్ రూమ్‌లోకి పరుగు తీసింది.

నీట్‌గా డ్రెస్ అయి భోజనం చేసి 9 గం॥ల కల్లా యింట్లోంచి బయల్దేరింది ఉష. కాలేజిలో అడుగు పెట్టేసరికి ఫస్ట్ బెల్ అయింది. గబగబా క్లాసురూం లోకి వెళ్లింది. అప్పటికే లెక్చరర్ వచ్చాడు. గుమ్మం బయట నిలబడి 'మేఐ కమిన్‌సార్' అంటూ లెక్చరర్ వంక చూసింది ఉష. 'ఎస్. కమిన్' అని మళ్లీ తన పనిలో మునిగిపోయాడు శ్రీధర్.

ఉష పరధ్యానంలో ఉండగానే మార్నింగ్ అవర్స్ కంప్లీట్ అయినాయి. మధు వచ్చి ఉషని వెనకచేత్తో పొడిచి 'రాణీగారు మేలుకునే కలలు కంటున్నట్టున్నారు. ప్లీజ్. యిప్పుడు ఏ లోకంలో ఉన్నారో గానీ అక్కడ్నుంచి త్వరగా భూలోకంలో ఉన్న యీ కాలేజీలోకి విచ్చేస్తే యీ లంచ్ టైమ్‌ని వేస్ట్ చెయ్యకుండా కాంటీన్‌లోకి పోయి కాస్త ఏదైనా టిఫిన్ చెయ్యచ్చు కమాన్' అంటూ ఉష పరధ్యానంలోంచి బయటకు వచ్చేలోగా ఆ చెయ్యి పుచ్చుకుని బరబరా లాక్కుపోయింది. బయట గుమ్మం దాటుతుంటే గడప తగిలి పూర్తిగా స్పృహలోకి వచ్చింది. తనెక్కడున్నదీ పూర్తిగా అర్థ

అయింది. వెంటనే గబగబా లోపలికి వెళ్లి బుక్స్ తీసుకుని 'అయామ్ సారీ మధూ, నేను యీ రోజు యింటికే పోతున్నాను. కాంటీన్ కి రాను. నాకు రేపు నోట్స్ యిస్తావా' అంటు ఉష మధురిమ వంక చూసింది. 'ఇస్తాను గానీ, ఏమిటో అంత రాచకార్యం మనలో మనమాట, ఏమైనా పెళ్లిచూపులూ గట్రా ఏర్పాటు చేసారా ఏమిటి ఖర్మ అయితే నేనుకూడా రానా. ఆ కోతిగారిని చూసి నేనుకూడా తరిస్తాను' అంది మధు నవ్వుతూ. 'నో నో నో, అటువంటివి మనకి ఏంలేవుగానీ, అయినా నాకు వచ్చే పెళ్లికొడుకు కోతిలా ఉంటాడని నీ ఉద్దేశ్యమా' అంది ఉష చిరుకోపంలో.

'మరి కాక, అందంగా ఉండే వాళ్లకి అంద విహీనులని, కురూపులకు అందంగా ఉండేవాళ్లనీ ఏర్పాటు చేస్తాడుట భగవంతుడు. మరి యీ అందాల ఉషారాణికి కోతిగారు కాక యింకెవరు వస్తారంటావు. పదలే, నువ్వేమో యింటికి పోయి కడుపు నిండా ఘాట్‌గా తింటావు. నేనేమో నీ పేరు చెప్పుకుని మలమల మాడుతూ క్లాసులో కూచోవాలి నీకు మొగుడు ఎవలొస్తే నాకేంగానీ మా తల్లీ, లంచ్ టైమ్ యింక ఎనిమిది నిముషాలే ఉంది గానీ పోయిరా' అంటూ ఉషని విడిచి గబగబా కాంటీన్‌కి దారి తీసింది మధు. వెళ్తున్న మధుని చూస్తూ నవ్వుకుని తను కూడా గేట్‌వైపు బయల్దేరింది ఉష.

అర్ధగంట నుంచున్నా బస్ రాకపోయేసరికి యింక లాభం లేదనుకుని వినుగ్గా రిక్షా కేక వెయ్యబోయింది. యింతలో అంత అవసరం రానివ్వనులే' అంటూ వచ్చింది డబుల్‌డెక్. సాగర్‌కి టికెట్ తీసుకుని ఎక్కి కూచుంది ఉష.

'ఎవరమ్మాయివమ్మా నువ్వు' స్పష్టంగా ప్రశ్న విన్పిస్తున్నా తనను కాదన్నట్టు బయటకు చూస్తోంది ఉష.

'మిమ్మల్నేనండి' పక్క అమ్మాయి ఉషని చేత్తో తట్టి పిలిచింది. ఇదెక్కడ ఖర్మరా భగవంతుడా అనుకుంటూ 'ఏమిటి?' అంటూ యిటు తిరిగి చూసింది.

ఎవరమ్మాయివమ్మా నువ్వు, ఎక్కడో చూసినట్టుంది' అన్నాడు ఎదురు సీటులోని ముసలాయన లాంటి పడుచాయన.

'శివా, రామారావుగారి అమ్మాయివి'

# ప్రేమించిన పెళ్లికొడుకు

అంది ఉష ఆయనను చూస్తూ.

'ఎక్కడికి వెడుతున్నావు సినిమాకా. ఒంటరిగా వెళ్తున్నావా! మీ యింట్లో అందరూ కలిసి వెళ్లరూ' ఆయన ప్రశ్నల వర్షం కురిపించాడు ఉషని పట్టి చూస్తూ.

ఆయన చూపుని భరించలేక 'అందరికీ ఒకసారి కుదరదు మాకు. ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు వెడతారు. అయినా నేనిప్పుడు సినిమాకి వెళ్లటం లేదు. కాలేజీ నుంచి యింటికి వెడుతున్నాను' అంది ఆయన చూపులు తప్పించుకుంటూ ఈయనకిదేం రోగమా అనుకుంటూ.

'అయితే ఎగ్జిబిషన్‌కి పోదాం రారాదూ' ప్రేమగా, అదోవికారంగా చూస్తూ అన్నాడు ఆయన.

ముసలితనం వస్తున్నా వెధవ బుద్ధి పోలేదు వీడి దుంపతెగా అనుకుంటూ 'ఇప్పట్నించీ ఎగ్జిబిషన్‌కి ఏమిటి మా స్వాపు వచ్చింది. నేను దిగిపోతున్నాను తాతగారూ' అంటూ పక్కనున్న పుస్తకాలు తీసుకుని దిగిపోతూ ఆ తాతగారిలాంటి ఆయన మొహం చూసింది. 'తాతగారన్న మాటకు ఆ ముసలి యువకుడి మొహం కత్తివాటు రక్తపుబొట్టు లేకుండా పాలిపోయింది.

జరిగినదంతా గుర్తుతెచ్చుకుని నవ్వుకుంటూ రాధకోసం చూసింది చుట్టుపక్కల. కానీ రాధ వచ్చిన జాడ కన్పించలేదు ఎక్కడా. 'అబ్బా బాగా ఆకలి వేస్తోంది. రాధ త్వరగావస్తే బాగుండు హోటల్‌కిపోయి యిద్దరం కలిసి టిఫిన్ చెయ్యచ్చు' ననుకుంటూ రోడ్డువైపు చూడసాగింది. ఇంతలో వెనకనించి 'ఉషా' అన్న కేక విన్పించింది. వెనక్కి తిరుగుదామనుకుని తిరగబోయి దూరాన స్కూటర్‌మీద వస్తున్న వ్యక్తిని చూసి ఆగిపోయింది ఆ ప్రయత్నం విరమించుకుని. ఎవరోకాదు అతను తన అన్న శేఖర్. అతను ఉషకి రెండుగజాల దూరాన ఉన్నాడు. యింతలో శేఖర్ ఫ్రెండ్ పిలవటంతో స్కూటర్ ఆపి పేవ్‌మెంట్‌మీద నిలబడి మాట్లాడసాగాడు. తనను పిలుస్తూ దగ్గరగావచ్చిన రాధని చూసి చిరునవ్వు నవ్వుతూ శేఖర్‌ని చూసి 'మా అన్నయ్య శేఖర్' అన్నది ఉష. 'అలాగా' అని నవ్వి 'అబ్బో' చాలా త్వరగా వచ్చేసారే ఉషారాణిగారు. మీరు ఇక్కడికి రావడం ఎగ్గొడతారేమో ఆ ఆశాభంగాన్ని ఎలా ఓర్చుకోవాలాం అని మధనపడుతున్న యీ రాధకి మీరాక ఆత్మానందం కలుగచేసిందనడం ఏమాత్రం అతిశయోక్తి లేదు. మీరు నమ్మాలి ఉషాకుమారీ' అని తనను వెక్కిరిస్తున్న రాధని చూసి 'ఆ ఆఁ ఇంకా మీరు అలాగే కబుర్లుచెప్తూ కూచోండి. నేనూ, నా ఆత్మారాముడు అర్ధగంటనుంచి మీకోసం ఎదురు చూస్తున్నాము. వచ్చికూడా మీరు యింకా అలాగే నిలబడుతూ బాతాఖానీ వేసుకున్నారంటే నా ఆత్మారాముడు మిమ్మల్నీ, నన్నూ కూడా మింగేస్తాడు అందుకని ముందు హోటల్ తర్వాత కబుర్లూ గిబుర్లూ విశేషాలు' అంటూ పక్కనున్న హోటలుకు దారితీసింది. అనుసరించటం రాధ వంతైంది.

టిఫిన్ ముగించి హోటల్‌నుంచి బయటకు వచ్చారు. సినిమాకి యింకా పది నిముషాలు టైముంది. 'సినిమాకి పోదామా ఉషా' లేకపోతే హాయిగా అలా పబ్లిక్ గార్డెన్స్‌కి వెడదామా' అన్న రాధ ప్రశ్నకు సమాధానంగా 'నేనూ అదే అడుగుదామనుకుంటున్నాను రాధా. యింతలో మీరే అడిగారు. అది ఒకసారి చూసిన సినిమానేకదా. ఒకసారికే బోర్‌గా ఉంది. యింకా రెండోసారి వెళ్లాలంటే డజన్ ఆస్ప్రోలు, రెండు అమృతాంజనం సీసాలు. మూడు ఫ్లాస్కుల కాఫీ తీసుకుపోవాలి. అంత శ్రమపడటం నాకు యిష్టం లేదు కనక హాయిగా పబ్లిక్ గార్డెన్స్‌కే పోదాము' అని ఎదురుగా వస్తున్న రిక్షాని కేకేసింది. ఇద్దరూ రిక్షాలో కూర్చున్నారు. రిక్షా సాగిపోతున్నంతసేపూ రోడ్డు పొడుగునా కనబడ్డ ప్రతి మనిషిమీదా ఏదో కామెంట్ చేస్తూనే ఉంది ఉష. 'తప్పు ఉషా, ఒకళ్లగురించి మనం అనుకుంటుంటే వాళ్లూ ఏదో మనల్నిగురించి అనుకుంటూనే ఉంటారు. అది చదువుకున్న వాళ్లు చేసే పనికాదు. అది సంస్కారహీనులు చేసే పని' అని వారించబోయిన రాధని 'ఓ యబ్బో. మహా సంస్కారవంతులు బయల్దేరారు. యికనేం యీ భారతదేశం బాగుపడిపోతుంది. కానీ ఆ సంస్కరణేదో ముందు నాతోనే మొదలు పెట్టినట్లున్నారు తమరు. అయినా కొంచెం 'సెన్సాఫ్ హ్యూమ

రుండాలి రాధగారూ. మనం వాళ్లగురించి అనుకోము అనుకోండి. కానీ వాళ్లు మనని గురించి ఏమీ అనుకోరని గ్యారంటీ ఏమిటో కొంచెం సెలవిస్తారా' ఎగతాళిగా అంది ఉష.

'ఏమిటో ఉషా, నీ అల్లరి ఎక్కువవుతోంది. నిన్నేంచెయ్యాలో నాకేమీ అర్థం కావడంలేదు. మనం అనుకోపోతే వాళ్లు కూడా ఏమీ అనరాతని అడిగావు వాళ్లు గడ్డితింటారని తమరు అంటారా ఉషాకాంతిగారు'. 'అవశ్యం, వాళ్లు ఒక బండి గడ్డి తింటే నేను రెండుబళ్లు తినటం ఖాయం, అంటే బళ్లు కాదనుకోండి. అందులో గడ్డి' అంటూ సీరియస్‌గా ఫోజ్ పెట్టింది ఉష.

'అబ్బబ్బ, ఒట్టి జగమొండి ఆ వచ్చే మొగుడు ఎలాంటివాడు వస్తాడోగాని వాడు మూడురోజుల లోపున ఛోమ్మని చావనైనా చస్తాడు. లేకపోతే సన్యాసుల్లోనన్నా కలిసిపోతాడు'.

'అలాగా, అయితే మా ద్వాం తే మీరారు చెప్పినట్లే జరిగితే యింకో మొగుణ్ణి వెతికి తెచ్చే బాధ్యతకూడా మీదేసుమా'.

'బాగుంది ఆ పాపమంతా నాకా, అంత మంది అమాయకుల్ని ఉసురు పెట్టినందుకు నేను ఏ రౌరవాది నరకానికో పోవాలి. అంత పని నావల్లకాదు సుమా'.

రిక్షా పబ్లిక్ గార్డెన్స్ ముందు ఆగింది ఇద్దరూ దిగి పైసలిచ్చి లోపలికి నడిచారు. ఉష ఒక పావలా పేరు సెనగకాయలు పొట్లం కట్టించుకుంది.

'ఏమిటే అంతలావు రాచకార్యం అంతా వివరంగా చెప్పండి. సావధానంగా చిత్తగిస్తాము' తాపీగా కూచున్న తర్వాత అడిగింది ఉష.

'పాపం! అందరూ ఈవిడగారి దయా ధర్మం మీద ఆధారపడినట్లున్నారు అయినా అంతలావు రాచకార్యాలు ఏమున్నాయి. ఏదో తమరిని చూడాలన్పించింది చూసాను. యింకొకటి కూడా ఉంది. చెప్పమంటావా! ఈ ఉషకి రాధంటే యిష్టమో మధురిమంటే మక్కువో తెల్సుకోవాలన్పించింది. దీనిని బట్టి విజయం నాదిలాగావే కన్పిస్తోంది. ఏమంటావు ఉషా!'

'నా నెత్తి. అనేందుకే మున్నది. నన్ను పరీక్ష చేసారన్నమాట. యింతోటి మాట సెలవిచ్చేందుకేనా కాలేజీ ఎగ్గొట్టించారు' అంటూ టైము చూసుకుని 'అబ్బ. అప్పుడే 6—30ని. శాంతి. యింక వస్తాను' అంటూ లేచి నిలబడింది ఉష.

'అయితే మళ్లీ పునర్దర్శనం ఎప్పుడో'

'హల్లో ఉషా! ఇక్కడున్నావా! అయామ్ సారీ! మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను. వస్తాను' అంటూ ఎక్కడి నుంచో ఊడిపడ్డ మధురిమ ఉష మాట్లాడేందుకు అవకాశము యివ్వకుండా ఎలా వచ్చిందో అలావే వెళ్లిపోయింది.

'ఆమే గదా మధురిమ'

'అవును—ఇంక నేను పోతాను. ఆలస్యమైతే యింటి దగ్గర మా అమ్మ తంతుంది. అంటే నిజంగా తంతుందని కాదు. తన్నినంతపని చేస్తుంది. అందుకని యీరోజుకి యింక గుడ్-బై' అంటూ చకచకా వెళ్లిపోయింది వెనక నించి రాధ పిలుస్తున్నా విన్పించుకోకుండా.

'వెధవ బస్‌స్టాప్. యింటికి అరమైలు దూరంలో తగలడింది. పూర్తిగా 7—30 కాలేదు. అప్పుడే రోడ్డంతా నిర్మానుష్యమైపోయింది. ఛీ—ఛీ. యిప్పుడు ఒకదాన్నీ బిక్కు బిక్కుమంటూ పోవాలి' అని లోలోన సణుక్కుంటూ పైకి ఎంతో బింకంగా నడుస్తుంది ఉష.

'హల్లో డార్లింగ్, కొంచం నెమ్మదిగా నడు ముందు పడ్డావంటే పళ్లు పదారూ రాలిపోతాయి. రేపు కట్టుడు పళ్లు పెట్టుకుని బడికి పోతే ... వాచిట్టి తల్లీ, నీ అవస్థ చెప్పాలా, అందుకని కొంచం నెమ్మదిగా నడు' గంభీరమైన మగగొంతు; దానికి లయగా బూటొట్ల టకటకలు విన్పించాయి వెనకనించి ఉషకి. గుండెలు జారిపోయాయి. భయపడ్డా నేనడక వేగాన్ని కొంచెం ఎక్కువచేసింది. 'ఓరీ నీ దుంపతెగ' అనుకుంటూ.

'ఏం! నీ అంత త్వరగా నేను నడవలేననుకున్నావా నా ముద్దులగుమ్మా. నిన్ను అవలీలగా ఒంటిచేత్తో గిరగిరాతిప్పి యింటి దగ్గర వదేటట్లు గిరవాటేస్తాను చూడు.'

భయపడుతూ నడుస్తున్న ఉష గుండె ఒకసారి ఆగిపోయినట్లయింది తన అసహాయస్థితికి కళ్లనుంచి నీళ్లు గిర్రున తిరగ్గా అవి కిందకి కారకుండా బలవంతాన నిగ్రహించుకుని 'ఇడియట్' యిట్లాగే యింటిదాకా రా, గూర్ఖా, నౌకర్లతోటి నిన్ను చట్నీ చేయిస్తానురా యూస్‌లెస్‌ఫూల్' బయటకు అనటానికి ధైర్యం చాలక లోలోన తిట్టుకుంటూ పళ్లు పటపటా కొరికింది ఉష. ఆ సమయంలో తలని వెనక్కి తిప్పటానికిక్కూడా ధైర్యం చాల్లేదు.

యింతలో వెనకనించి సన్నగా కిలకిలా రావం విన్పించింది. ఒక్కసారి అదిరిపోయింది ఉష. అరె, యిందాకట్నించి అతను అనేది తనను కాదన్నమాట ఒక్కసారి కూడా తల వెనక్కి తిప్పలేని తన ధైర్యం చూస్తే తనకే నవ్వు వచ్చింది. యిప్పుడు తాపీగా తలని వెనక్కి తిప్పింది.

'పోనోయి, పెద్ద కోతలు కోస్తావు. అయినా మామయ్యా మరి యింతదూరం వాతో నీవు కష్టపడి ఎందుకు వచ్చినట్లు,



యింటిదగ్గరనుంచి నువ్వు నన్ను విగ్గి విషన్‌తో గిరవాటేస్తే అక్కడంతా చూసి ఎవడైనా నీలాంటివాడిచేత యింటిదగ్గర గిరవాటేయించుకు నేదాన్ని. అక్కడనుంచి వరాసరి యింటిదగ్గర నీ ఒళ్లో పడే దాన్ని.' తొమ్మిది పదేళ్ల పిల్ల వాళ్ల



మామయ్యని ఆటలు పట్టిస్తూంది. వాళ్ళని చూసి నవ్వుకుంది ఉష.

* * *

ఉదయం హాల్లో అందరూ కాఫీ టిఫిన్స్ సేవిస్తున్నారు. ఉన్నట్టుండి ఉష తండ్రి రామారావుగారు 'శారదా, మొన్న బజార్లో మా పెద్దనాన్నగారి అమ్మాయి జానకి కన్పించింది. జానకి నీకు గుర్తు ఉండే ఉంటుంది. ఎర్రగా పొడుగ్గా ఉండేది చూడు. ఎవర్నో ప్రేమించి మా పెదనాన్నతీ

యిన్నాళ్ళలేక కేకలేస్తే 'అతన్తో యిల్లు విడిచి వెళ్ళిపోయింది చూడు జానకి పాపం భర్త పోయాడుట. నన్ను చూసి బజార నైనా చూడకుండా గావురుమంది. 'అయిన వాళ్ళెవరూ కాకుండాపోయారు. ఈవాళ్టికి నీవు కన్పించావు' అంటూ. దానికి ఒక కొడుకు. ఇరవై ఆయిదేళ్ళుంటాయి. చాలా బాగున్నాడు. ఎం.ఎస్సీ ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయ్యాడట 'ఒకసారి వదినా పిల్లల్నందరి తీసుకురా అన్నయ్య' అంటూ ఎడ్రసిచ్చింది. వాడు అంటే దాని కొడుకు కూడా చాలా బాగా కలుపుగోలుగా మాట్లాడాడు. ఈరోజు ఆదివారమే కదా. అందరం సరదాగా అలా పోయొద్దాం' అన్నారు.

'అలాగా, పాపం, ఎలా ఉంటోందో ఏమిటో ఒక్కత్తీ. సాయంకాలం పోదాం' అంటూ పనిమీద లోపలికి వెళ్ళిపోయింది

'ఏమిటేమిటీ, అంతా కలగా ఉంది. యీ ఊళ్ళో నాకో అన్నయ్యా మా ఉషకో మొగుడూ ఉన్నారన్న మాట. యింకేం, మా ఉషమ్మ పెళ్ళికూతురాయెనే. మా ఉషమ్మకి కాబోయే మొగుడు పెళ్ళికొడుకాయెనే' అంటూ ఆడబిడ్డని ఆటలు పట్టించపోగింది వాసంతి. ఉష వదిన నెత్తిన ఒక చిన్న మొట్టికాయ మొట్టి లోపలికి తుర్రుమంది.

సాయంత్రం అందరూ బయల్దేరారు. రానని మొరాయిస్తున్న ఉషని ఏడిపించి మరీ లాక్కెళ్ళింది వాసంతి.

ఒక అందమైన చిన్న బంగళాని చూసి 'యిదే' అని లోపలికి దారి తీసారు రామారావుగారు. అందరూ అనుసరించారు. ముందున్న గార్డెన్‌లో ఒక సిమెంట్ చప్టా మీద కూచుని పుస్తక పఠనలో నిమగ్నుడైన ఒక యువకుణ్ణి చూసి శిలా ప్రతిమే అయింది ఉష. అయితే తను వచ్చింది ... ఉష ఊహ పూర్తి కాకుండానే 'అదేమిటమ్మా! అలా నిలబడిపోయేవు అతను ఎవరనుకున్నావు? నీ బావ! జానకమ్మ కొడుకు రాధాకృష్ణ' అన్నారు రామారావు.

ఆ మాటలకి ఏకాగ్రత చెదిరిపోగా పుస్తకం మీదనుంచి దృష్టి మరలించాడు అతను. క్షణకాలం తన కళ్ళని తానే నమ్మలేకపోయాడు. కలో, వైష్ణవ మాయో అర్థం చేసుకోలేకపోయాడు! తన రాణి, ఉషారాణి తన యింటికి వచ్చింది. మరి వాళ్ళంతా ఎవరు! ముందున్నది మొన్న బజార్లో కన్పించిన రామారావు మామయ్య. వాళ్ళంతా వాళ్ళ కుటుంబం అయిఉండాలి. అయితే ఉష తనకి... రాధ ఊహ పూర్తి కాకముందే రామారావుగారు పలకరించారు. 'ఏమోయ్! అమ్మ యింట్లో ఉందా' అంటూ. ఊహా లోకంలోంచి బయటికి వచ్చాడు రాధ. 'ఆ ఆ ఉంది. పదండి' అంటూ ముందుకి దారి తీసాడు. వరండాలోనే ఎదురైంది జానకమ్మ అందరినీ ఆదరంగా ఆహ్వానించింది. ఉషని దగ్గరికి తీసుకుంటూ' నీ కూతురా అన్నయ్యా, అయితే నా కోడలన్నమాట.' అంటూ ఆప్యాయంగా ఉష తల నిమిరింది జానకమ్మ. 'మళ్ళీ మాట తప్పిపోరాదు పిన్నిగారూ. అయినా మీరు మరీ ముందు వెనకలు చూసుకోకుండా అన్నారు. ఆవిడెంత గయ్యాళో నే నెట్లా చెప్పేది. సూర్యకాంతానికన్న నూరురెట్లు పవరెక్కువుంది. మరి మీరూ, అన్నయ్యగారూ ఎలా నెగ్గుకొస్తారో నాకంతా అయోమయంగా ఉంది' ఉస్సూరు మంటూ నిట్టూర్పు విడిచింది వాసంతి.

'మరీ నీ దంతా సోద్యమే అమ్మాయీ. పిల్లని చూస్తుంటే అసలు నోట్లో నాలుక ఉందా లేదా అని అన్పిస్తోంది. ఎంత వదినవైనా మరీ అంత ఘాటా' వెన కేసుకు వచ్చింది జానకమ్మ ఉషని.

'నిజమేనమ్మా, ఆవిడ చెప్పినమాట నేనూ ఒప్పుకుంటున్నాను. అసలు నేనే యీమెని ఒకనాడు తీసుకువచ్చి నీ కోడలని పరిచయం చేద్దామనుకుంటున్నాను. అంతలో యీమె అత్తగారిని వెతుక్కుంటూ వచ్చింది' అన్నాడు రాధాకృష్ణ.

'అయితే మీ కిదివరకే పరిచయమున్నమాట' ఆవులించింది వాసంతి. 'నే ననుకుంటూనే ఉన్నాను యీ మధ్య ఉష వరస చూసి'. 'నీ కెలా పరిచయమే యితడు' కూతుర్ని అడిగింది శారదమ్మ. 'ఏముందీ, ఒకనాడు బస్‌లో నాతో దెబ్బలాటేసుకున్నాడు ఒ.కా ప్రబుద్ధుడు. మళ్ళీ ఒకరోజు కాలేజి ముందు కన్పించి 'గుర్తున్నానా' అంటూ మాట కలిపాడు. అలా పరిచయం పెరిగింది. నీకు తెలీదు గాని మొన్న ఒక ఉత్తరం వచ్చింది చూడు. రాధ రాయలా, ఆ రాధ ఎవరనుకున్నావ్. ఈ రాధాకృష్ణే' అంటూ నవ్వింది ఉష. 'ఓసి నీకా తెలివి బంగారంగానూ, రాధంటే నేను ఆడపిల్లమనుకున్నాను.' ముక్కుమీద వేలేసుకుంది.

నెల తిరక్కుండానే కుమారి ఉష శ్రీమతి ఉష అయింది. పెళ్ళికి వచ్చిన మధురిమను చూసి 'మధూ 'మా కోతి గార్ని చూపావా అని రాధతో 'యివి నాతో పందెం వేసింది, నాకు కోతిలాంటి మొగుడు వస్తాడని' అంది ఉష చిలిపిగా.

'నా కేం తెలుసు నువ్వో పెళ్ళికొడుకుని ప్రేమించి నాతో వాదనకు దిగావని' అంటూ మధు ఉష నెత్తిన మొట్టింది చిన్నగా, వాళ్ళిద్దర్నీ చూసి నవ్వుకున్నాడు రాధ. ●



**జరిగిన కథ**

శంకరం మాస్టారి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన పూర్తిగా మారిపోతుంది. అతని అక్కయ్య జ్యోతికి ఆనందరావుతో వివాహమవుతుంది. ప్రాణస్నేహితులయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసుకుంటారు. రమణ భర్త వెంకట్రావు. వేణు సుశీలను వివాహం చేసుకుంటానని వాగ్దానం చేస్తాడు. కాలేజీలో వేణుకు ఉషతో పరిచయమవుతుంది. జ్యోతి సుశీలను గురించి ఉత్తరం రాసి వేణుకు కర్తవ్యాన్ని జ్ఞాపకం చేస్తుంది. పార్టీ రాజకీయాలకు ఆనందరావు బలైపోతాడు. సుశీల వరదరాజు కూతురని తెలుసుకున్న వేణు వివాహానికి నిరాకరిస్తాడు. శంకరం మాస్టారి సలహాను కూడా లక్ష్యపెట్టడు.




## 26

రమణ పెద్దగా నిట్టూర్చింది...'ఇప్పుడు నీ ఆరోగ్యం ఎలా వుంటోంది జ్యోతీ?.'

'ఆరోగ్యానికేం రమణా!... నిక్షేపంలా వున్నాను. ఆయన ఆయుష్షు కూడా పోసుకుని...'

'అలా మాట్లాడకు జ్యోతీ!...నువ్వయినా కలకాలం బాగుండాలి...నీ కోసం కాకపోయినా, నీ బిడ్డకోసం, ఆనందరావు వంశాంకురంకోసమైనా నువ్వు ఆరోగ్యంగా వుండాలి...ఆ బిడ్డను వృద్ధిలోకి తేవల్సిన బాధ్యత నీకే వొప్పగించిపొయ్యాడు నీభర్త... ఆ బాధ్యతను మర్చిపోకు...దాన్ని తప్పించుకోవాలనుకోకు జ్యోతీ!...'

'రమణా!...ఎంతసేపు యిలా నిలబడతావ్?...ఆ గదిలో ఎవ్వరూ లేరు...అక్కడికి వెళ్ళి మాట్లాడుకుందాం పద...' అంటూ యింకో గదిలోకి తీసుకువెళ్ళింది జ్యోతి... అక్కడ తను పుట్టింటికి వెళ్ళకుండా, యీ వూళ్ళోనే వున్నందుకు గల కారణాలు అవీ చాలా విషయాలు చెప్పింది జ్యోతి.. ఇద్దరూ ఓ అరగంటసేపు మాట్లాడుకున్నారు...

'జ్యోతీ!... మళ్ళీ ఎలక్షన్సు జరగబోతున్నాయిటగా?'

'ఏమో నాకేం తెలుసు రమణా?...ఇప్పుడా ఎలక్షన్సును గురించి పట్టించుకునే వాళ్ళు లేరుగా యీ యింట్లో?...'అంది జ్యోతి బొంగురుపోయిన గొంతుతో, ఆనందరావును తల్చుకుని బరువుగా నిట్టూర్చి...

రమణకా మాటలు అంపంతో కోసినట్లనిపించాయి...కాస్సేపాగి, 'ఏం ఎందుకు పట్టించుకోకూడదు జ్యోతీ?...ఆనందరావుగారు పోతే పట్టించుకోకుండా ఎందుకుండాలి మీరంతా.'

'ఎందుకు రమణా! వద్దు...ఎవరు కోరినా గ్రామం అభివృద్ధి కావడమే గదా?... కావలసింది!...ఆయన ఆఖరిసారి నాకిచ్చిన మాట కూడా అదే...ఈ ఎన్నిక కాగానే యిక పోటీ చెయ్యనని మాట యిచ్చారు... వెంకట్రావుగారినే, ఏకగ్రీవంగా సర్పంచ్‌గా ఎన్నుకుంటామని కూడా మాట యిచ్చారు ...అందుకే రమణయ్యగారు పోటీ చేస్తానన్నా వద్దని చెప్పాను... అందరు కోరేది ఒకటే అయినప్పుడు ఎవరు నిలబడినా ఒకటే...ఎవరు పదవిలోకి వచ్చినా ఒకటే... వెంట్రావుగారే పాటుపడుతారు గ్రామాభివృద్ధికి...' మళ్ళీ నిర్లిప్తతతో అంది జ్యోతి...

'అంటే నీవుద్దేశం?'

'వెంకట్రావుగారి మీద పోటీ చెయ్యబోవటం లేదు మా వాళ్ళు... అంటే ఆయన ఏకగ్రీవంగా ఎన్నుకోబడతారు...'

'జ్యోతీ! ... బాగా ఆలోచించే యీ నిర్ణయానికి వచ్చావా?... నీ భర్తను హత్య చేసినందుకు ఆయనకు ముడుతున్న ప్రతిఫలమా యిది? ... పదవికోసం, పదిమంది పోగయి నిండు ప్రాణం తీసినందుకు మువ్విచ్చే పారితోషికమా యిది?...' రమణకు దుఃఖం ఆగలేదు...పైట కొంగులో మొఖం దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తూ అంది రమణ...

'రెండు చేతులూ కలుస్తేనే చప్పుడవుతుంది!...ఇరుపక్షాలు కక్షలు పెంచుకున్నప్పుడే హత్యలు జరుగుతాయి ... ఒద్దు రమణా!...మళ్ళీ యీ కక్షలు వద్దు...ఈ హత్యలు వద్దు...' జ్యోతి ఏడుపు దిగమ్రింగుకుంటూ అన్నది..

'ఈ మాట వెంట్రావుగార్నే రానీ రమణా!...ఇక ముందైనా యీ పోటీలు, ఎత్తులు పైఎత్తులూ లేకుండా మన వూరికి కావల్సిన సౌకర్యాలను ఆయన్నైనా సమకూర్చనీ...ఆయన చేసే ప్రతి పనికి మా అందరి సహాయం వుంటుందని చెప్పు. ఈ పోటీలు యీ రాజకీయపుటెత్తుగడల్లో అసలు లక్ష్యం మర్చిపోతున్నారు వీళ్ళు... ఆ లక్ష్యం సాధించమని చెప్పు...'

'జ్యోతీ!...ఇప్పుడు వీళ్ళల్లో ఎవరొచ్చినా అసలు లక్ష్యం సాధించగలరనుకుంటున్నావా?...ఉత్తది... వాళ్ళ మనసులు కలుషితమైనాయి...లక్ష్యం సాధించాలంటే, మన వూరు బాగుపడాలంటే, కలుషితమైన మన వూరి వాతావరణం బాగుపడాలంటే, న్యాయబుద్ధి వుండాలి...విశాల దృక్పథం వుండాలి...ఈ పార్టీలకు యీ కక్షలకు ముఠాతత్వాలకూ అతీతమైన నిష్పక్షికమైన సమభావం వుండాలి...కానీ వీళ్ళల్లో అవి లేవు జ్యోతీ!...ఇప్పుడు వీళ్ళ చేతికి అధికార మివ్వడం కోతికి కొబ్బరికాయ యివ్వడం...బాగా ఆలోచించు జ్యోతీ...'

'అయితే ఎవరొస్తే అలా ప్రవర్తించగలరంటావ్?...ఆ గుణాలు ఎవరిలో వున్నాయంటావ్ రమణా! ఎవరా లక్ష్యాన్ని సాధించగలరు?'

'దాన్ని సాధించ గలిగింది నువ్వొక్కదానివే జ్యోతీ!...నువ్వొక్కదానివే...అందుకే వచ్చాన్నేను...నువ్వు నిలబడు... నువు పోటీ చెయ్యి...'

'నేనా? !!!'

'అవును...నువ్వే...నువ్వొక్క దానివే ... నువ్వొస్తేనే గ్రామాన్ని బాగు చెయ్యగలవు.. ఇంక వీళ్ళెవరొచ్చినా, ఏ పక్షం వాళ్ళొచ్చినా, రెండో పక్షాన్ని తొక్కేయాలనే

పోస్తారు... కక్షలు పెరగడం తప్ప గ్రామాభి వృద్ధి జరగదు...'

'వద్దు రవణా...నా కొద్దు...నన్నీ రాజకీయాల్లోకి దింపాలని చూడకు ... మన వూరు బాగు కోసం, మన వూరి ప్రజల కోసం నేను చెయ్యగలిగిం దేదో నేను చేస్తూనేవున్నాను...ప్రజాసేవ చెయ్యడానికి పదవు లక్కరలేదు రవణా!... పదవులక్కరలేదు..'

'కానీ...అసలు నిజంగా ప్రజలకు సేవ చెయ్యాలనే కాంక్ష లేనివాళ్ళకు, ఆ త్యాగ నిరతి, సేవాతత్పరత, సమదృష్టి లేని వాళ్ళకు పదవులు కట్టబెట్టడం, అపాత్ర దానం చెయ్యడంలాంటిదే అవుతుంది జ్యోతి అధికారాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలో తెలియనివాళ్ళకు అధికారం అప్పజెబితే జరిగే దేంటి?...అధికార దుర్వినియోగం...రాజకీయాలని నువ్వు పారిపోడం ఎందుకు?... నీలాంటి వాళ్ళందరూ, రాజకీయరంగాన్ని అసహ్యించుకుని దూరంగా వుంటుండబట్టే, అటువంటివాళ్ళు ఆ రంగంలో ప్రవేశించి కలుషితం చేస్తున్నారు...' అంది రవణ ఆవేశంగా...

జ్యోతి ఆలోచనలో పడిపోయింది. 'రవణ చెప్పిందాంట్లో అబద్ధమేమైనా వుందా అని? ... కానీ రవణ యింత ప్రపంచ జ్ఞానాన్ని యింట్లో కూర్చుని ఎప్పుడు సంపాదించుకో గలిగింది?...కానీ...తను... తను... పోటీ చెయ్యగలదా?... మళ్ళీ ఎన్నికలంటే, యీ అకృత్యాలన్నీ జరగవా?...

'వద్దు రవణా!...మళ్ళీ యీ దొమ్మీలు జరగడానికి వీల్లేదు...మళ్ళీ రాజకీయాల పేర వింతు ప్రాణాలు బలి కాకూడదు... వద్దు...' అంది జ్యోతి చేతులు జోడించి రవణకు నమస్కారం చేస్తూ, బలవంతం చెయ్యవద్దన్నట్టుగా...

'ఈ సారి నీకా భయం వుండదు జ్యోతి! ... ఆనందరావుగార్ని హత్య చేసిం దెవరో ఆచూకీ తియ్యడానికి పోలీసులు దర్యాప్తు జరుపుతున్నారని తెలిసింది ... కానీ...ఆ హత్యకుపయోగించిన ఆయుధం దొరకలేదని కూడా విన్నాను...ఇన్నాళ్ళదాకా మా వారిని అరెస్టు చెయ్యకపోవడానికి కారణం బహుశా ఆయన పలుకుబడేమో. నిర్ధారణ కాందే నిర్బంధంలోకి తీసుకో కూడదనుకొని వుంటారు ... ఇదుగో ... జ్యోతీ...' అంటూ తెచ్చిన తన బ్యాగ్లో నుండి ఒక బాకును బైటికి తీసింది రవణ...

'ఇదే ఆ ఆయుధం... ఆ రోజు రాత్రి దీన్ని మా యింట్లో గుంట తవ్వి పెడుతుంటే చూశాను ... మర్నాడు ఎవ్వరూ లేకుండా చూసి తవ్వి తీశాను...అప్పటి నుండీ దీన్ని మీకందజెయ్యాలంటే వీలుకాలేదు...'

రవణ చేతిలో నుండి బాకు నందుకున్న జ్యోతి ఒక్కసారి దుఃఖం ముంచుకు వచ్చింది...దీంతోనా వెంకట్రావు తన భర్తను తన నుండి దూరం చేసింది?... ఓహ్!... తను తల్చుకుంటే యిది...తనను కూడా... తన భర్త దగ్గరకు పంపగలదు...కానీ... తన బిడ్డ... ఈ కడుపులోని ఆనందరావు బిడ్డను హత్యచేసే అధికారం తనకు లేదే?...ఒక్క క్షణం ఆ బాకును గుండెల కదుముకుంది జ్యోతి...కన్నీళ్ళు ప్రవాహంలా కారుతున్నాయి...ఇదే తన భర్తను...నెత్తురు మడుగులో ముంచేసింది!...బాకును తీక్షణంగా చూసింది జ్యోతి...తను తల్చుకుంటే ...



## పశ్చాత్తాపం...

ఇదే వెంకట్రావును కూడా పురికంబం ఎక్కించగలదు ... తన భర్తను చంపిన వెంకట్రావు!... మరుక్షణం కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుని, ఏడుస్తున్న తనవైపు జాలిగా చూస్తున్న రవణ కన్పించింది ... జ్యోతి ఆవేశమంతా చప్పచల్లారి పోయింది..

'రవణా! ... నీ భర్తను పురికంబం ఎక్కిస్తే నా భర్త తిరిగి వస్తాడా?' అని ప్రశ్నవేసింది జ్యోతి చాలా శాంతంగా, తన మనసును స్వాధీనంలోకి తెచ్చుకుని...

'జ్యోతీ! ... వద్దు ... నువ్వు క్షమించొద్దు ... మమ్మల్ని క్షమించి చిత్రవధ చెయ్యొద్దు...ఏరోజు ఏం జరుగుతుందోనని, సగం చచ్చిన స్థితిలో వున్నాన్నేను ... నువు నెత్తురు కూడు తింటున్నావని మనసు ఆంపవుకోత పెడుతోంది... చిత్తక్షోభ నేను భరించలేకుండా వున్నాను జ్యోతి! ... దీనికి బదులు ... మమ్మల్ని శిక్షయినా అనుభవించనీ ... మనసు తేలికపడుతుంది. ఇది పోలీసుల కందివ్వు చాలు ... నేను అంతరాత్మకు జవాబు చెప్పుకోలేకుండా వున్నాను జ్యోతీ!...' అంది రవణ పమిటచెంగులో మొఖం దాచుకుని వెక్కివెక్కి ఏడుస్తూ...

'రవణా!...నా భర్త ప్రాణాలకు బదులు నీ భర్త ప్రాణాలు కోరనా? ... బాగుంది రవణా!...' జ్యోతి నిట్టూర్చింది ... 'ఇదుగో...తీసుకో...ఈబాకు మళ్ళీ ఎవ్వరికీ కన్పించకుండా దాచెయి...నువ్వయినా కలకాలం పసుపు కుంకుమలతో సుఖంగా వుండు' అంది జ్యోతి జీరబోయినగొంతుతో...

'ఒద్దు జ్యోతి!...అపరాధం చేసినప్పుడు శిక్ష అనుభవించాల్సిందే ... అలా శిక్ష అనుభవించినప్పుడు మనసుకు కాస్త బరువు తగ్గుతుంది...తప్పుచేసినవాళ్ళు శిక్ష అనుభవించకపోతే...మళ్ళీ...మళ్ళీ...అలా తప్పులు చేస్తూనే వుంటారు...'

'పిచ్చి రవణా!...' జ్యోతి రవణ తల నిమురుతూ ఆప్యాయంగా అంది...

'తప్పుచేసినప్పుడు శిక్ష విధిస్తే తప్పులు చెయ్యడం మానుకునేట్లయితే, దొంగతనం చేసి శిక్ష అనుభవించినవాళ్ళే మళ్ళీ ఎందుకు దొంగతనం చేస్తున్నారు? ... ఉరిశిక్ష పడుతుందని తెలిసీ హత్యలు ఎందుకు జరుగుతున్నాయి రవణా? ... మానసికంగా తప్పుచేశాం అని బాధపడగల్గినప్పుడు తప్పు చెయ్యకుండా వుండడానికి ప్రయత్నిస్తారు..

# మహారాః సంధ్యా ప్రవర్తతే..

అంతే ... ఇదుగో ... మళ్లీ దాచెయి...ఇది యింకెవరికంటయినా పడనిస్తే నామీద ఒట్టే ... నువ్వయినా పచ్చగావుండు...' అంటూ లేచి కుంకుమ భరిణతెచ్చి రవణ నుదుట కుంకుమ దిద్దింది జ్యోతి...

'జ్యోతి!' అంటూ ఆమె ఒడిలో వాలి పోయింది ఏడుస్తూ రవణ...

* * *

'ఎక్కడికి రవణా!...ఎక్కడికి వెళ్లొస్తున్నావ్ యీవేళప్పుడు?' దొడ్డి తలుపు తోసుకుని యింట్లో ప్రవేశించగానే నిప్పులు కక్కే కళ్లతో ఎదురుగా కన్పించాడు వెంకట్రావు...

రవణ మాట్లాడలేదు...రౌద్రాకారంతో వున్న అతడివైపు తిరస్కారంగా చూచి, గబగబా నాలుగడుగులు వేసింది రవణ ...

'ఆగు!...ఎక్కడికి వెళ్లావో చెప్పమంటే లోపలకు పోతావేం?' రవణ కొప్పుపట్టుకుని భీకరంగా చూస్తూ అడిగాడు...

'జ్యోతి దగ్గరకు...' రవణ చాలా ప్రశాంతంగా చెప్పింది...

'ఎందుకు? ... ఎందుకెళ్లావ్ వాళ్లింటికి? ... నన్ను వురిస్తంభం ఎక్కించాలని ప్రయత్నిస్తున్నవాళ్లతో నీకేం పనొచ్చింది?'

రవణ మాట్లాడలేదు . అతడి పట్టు విడిపించుకుని లోపలకు వెళ్లబోయింది... కొప్పుపట్టి మళ్లీ ఒక్క గుంజు గుంజాడు వెంకట్రావు...

రవణ ఆగింది...అతడి మొఖంలోకి అదే విధంగా తిరస్కారపూర్వకంగా చూస్తూ, 'జ్యోతి! ... మిమ్మల్ని వురికంబం ఎక్కించాలనుకోలేదు! అలా అనుకున్నది మీ భార్య!' రవణ తన బొడ్లో బాకు బైటికి లాగింది ... 'ఇదుగోండి ... మీరు ఆమె భర్తను హత్యచేసింది యీ బాకుతో...'

వెంకట్రావు గజగజలాడి పొయ్యాడు ... నిలువెల్లా వణుకుతూ, 'ఇది...ఇది...ఎక్కడ దొరికింది...?' అన్నాడు...

'నేనే తీశాను ... పోలీసులకు ఆమాకీ యివ్వమని...నేను వెళ్లి దీన్ని జ్యోతి చేతిలో పెట్టాను...తను ఏమందో తెలుసా?...' రవణ కళ్లనిండా నీళ్లు నిండినయి...

'ఏ మ ం ది? ?...' వొణుకుతున్నాడు వెంకట్రావు...

'నీ భర్తను వురికంబం ఎక్కిస్తే నా భర్త తిరిగి వస్తాడా అంది...మళ్లీ దీన్ని ఎవరికంటా పడకుండా దాచెయ్యమని తన మీద ఒట్టుపెట్టుకుంది...నన్ను కలకాలం పసుపు కుంకుమలతో సుఖంగా వుండమని దీవించి పంపింది నా ప్రాణస్నేహితురాలు జ్యోతి!'

వెంకట్రావు చేతిలోంచి రవణ కొప్పు జారిపోయింది... కుప్పలా కూలబడింది రవణ ఏడుస్తూ ... 'మీ మీద పోటీ పెట్టొద్దని చెప్పిందిట ... మీరు పోటీలేకుండా ఎన్నికలు గ్రామాభివృద్ధికి పాటుపడమని చెప్పింది...నేనే వీల్లేదన్నాను...తనను పోటీ చెయ్యమన్నాను.. తను పోటీ చేస్తే... నన్ను మీరు చంపినా సరే...నా ఓటు జ్యోతికే వేస్తాను...' రవణ ఎక్కిళ్లు పెడుతూనే అంది...

'కానీ...నువు... నువు...నన్ను... పోలీసులకొప్ప చెప్పడానికి...వెళ్లావా?...' అన్నాడు వెంకట్రావు...'ఏం నేను...లేకుండా పోతే .. నీ యిష్టం వచ్చి ... నట్లు ... కులకచ్చనా?...' తీక్షణంగా చూస్తూ అడిగాడు..

'కులుకుతానా!... హుం... ఇదుగోండి ... ఈ 'ఎండ్రిన్' నా దగ్గరే వుంచుకొన్నాను... మిమ్మల్ని పోలీసులు పట్టుకున్న మరుక్షణం... నేను...నేను యీ ప్రపంచం నుండే ... వెళ్లిపోతాను...' రవణ ఒక్క క్షణం ఆగింది... 'మీకు...మీకెవ్వరికీ...అర్థం కాదు...యీ నెత్తుటికూడు...తినడానికి... నా అంతరాత్మ...ఎంత క్షోభపెడుతోందో... ఎంత కోత ... భరిస్తోందో?...' రవణ ఏడుస్తూ అక్కడే పడిపోయింది...

వెంకట్రావుకు తల తిరుగుతున్నట్లయింది...ఒక స్నేహితురాలు తన భర్తను హత్యచేసిన వాడ్ని క్షమించింది...ఇంకొకరు... తన భర్తను అప్పగించడానికి సిద్ధపడింది!. స్నేహం యింత పవిత్రమైందా!...

వెంకట్రావుకు ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు... రవణా, జ్యోతి వీళ్లద్దరే కనిపిస్తున్నారు అతడి కళ్లల్లో...తనూ ఆనందరావూ కూడా స్నేహితులే చిన్నప్పుడు!... కవలపిల్లల్లా కలిసి తిరిగేవారు కూడా... ఒకసారి యిద్దరికీ ఎందుకో తగూ వచ్చింది... అది పెద్దవాళ్ల దాకా పోయి, పిల్లల్ని పిల్చి చీవాట్లు పెట్టాల్సింది పోయి పెద్దవాళ్లే హోరాహోరీ తగూలాడుకున్నారు. అది చేలకు గట్లువేసుకోడం, కాలువ గండి కొట్టడం దాకా పోయి గొడ్డళ్లతో నరుక్కోడం దాకా వచ్చింది. ఆనందరావు తండ్రీ, వెంకట్రావు తండ్రీ యిద్దరూ వూళ్లో కల్లా పెద్ద భూమందులు...వాళ్ల ఆశ్రయులు వాళ్ల పార్టీ, వీళ్ల ఆశ్రయులు వీళ్ల పార్టీ...ఊరు యించుమించు రెండుగా చీలిపోయింది. ఆ యింటి నీరు కాకి యీయింటి మీదికి వాలగూడని పరిస్థితి వచ్చింది...పొలం గట్ల తగాదాలో కోర్టుల



దుట్టూ తిరిగారు...దొమ్మీలు జరిగాయి... ఒకటి రెండు ఖూనీలు కూడా జరిగాయి... వేలు వేలు కోర్టులకు పోశారు ... తండ్రి పోగానే వాళ్ళిచ్చిన ఆస్తితోబాటు వాళ్ళు పెంచిన విరోధాలకు కూడా వారసు లయ్యారు... దానికితోడు యీ ఎలక్షన్లు దోహదం చేశాయి...చివరికి అది ఆనందరావు ప్రాణం బలికొన్నది...

తెలతెలవారుతుండగా, కండువా భుజాన వేసుకుని బయలుదేరాడు వెంకట్రావు, రాత్రి రవణ జారవిడిచిన బాకు తీసుకుని...

ఆ సమయంలో ఆ విధంగా వచ్చిన వెంకట్రావును చూచి, జ్యోతి యింటి ముందున్న పాలేరు తెల్లబోయి గుడ్లప్ప గించి చూస్తూ నిలబడ్డాడు. అప్పుడే నిద్ర లేస్తున్న రంగడ్ని జ్యోతిగార్ని పిలుచుకు రమ్మని పంపాడు వెంకట్రావు.

'సుప్రభాతం' చదువుకుంటున్న జ్యోతి వచ్చి వెంకట్రావును చూచి నిర్ఘాంత పోయింది...

'ఏం పనిమీద వచ్చారు వెంకట్రావు గారూ!... నేను...జ్యోతిని...ఆనందరావుగారి భార్యను... మీకు ఆనందరావుగారి మీద కక్ష యింకా మిగిలి వుంటే... తీర్చు కోండి ... శత్రుశేషమూ, ఋణశేషమూ వుండకూడదుట ...' అంది గంభీరంగా జ్యోతి, వెంకట్రావు చేతిలో వున్న బాకును చూసి...

వెంకట్రావు ఒకసారి చేతిలోని బాకు వైపు చూసి, మళ్ళీ జ్యోతి వైపు తిరిగి, 'నేను ... మీ స్నేహితురాలైన, రవణ భర్తను ... మీలో వున్నంత వుదాత్తత లేక పోయినా మరీ అంత దిగజార లేదమ్మా...' అన్నాడు వెంకట్రావు...

'అయితే మరి ఎందుకు వచ్చినట్లు చెప్పండి వెంకట్రావుగారూ?' జ్యోతి చాలా సౌమ్యంగానే అడిగింది...

'ఇవ్వాళ నామినేషన్లు దాఖలు చెయ్య వలసిన ఆఖరిరోజు...మిమ్మల్ని కూడా నామి నేషను దాఖలు చెయ్యమని కోరడానికి వచ్చాను నేను...మీరు ఎన్నికల్లో నిల బడండి ... నేను నిలబడను. మిమ్మల్ని మేమంతా బలపరుస్తాం...'

జ్యోతి నిర్ఘాంతపోయి చూస్తోంది, యీ మాట్లాడేది వెంకట్రావుగారేనా? అని...

'ఇదేదో క్రొత్త పన్నాగమని మీరు సంశ యించకండి...నేను మిమ్మల్ని మనస్ఫూర్తి గానే అడుగుతున్నాను. మీరు నా కన్ను

# మీ కుటుంబ ఆరోగ్యముకోసం విటమినులు మరియు ఖనిజములు ఆవశ్యకం.

## ఇవి చాలినన్ని వారికి లభించుచున్నవా?

SQUIBB
VIMGRAN
MULTIPLE VITAMINS-MINERALS TABLETS
SARABHAI CHEMICALS



## క్రొత్త విమ్‌గ్రన్® మల్టివుల్ విటమినులు-ఖనిజముల బిళ్లలు!

విటమినుల మరియు ఖనిజముల లోటు మీ కుటుంబ ఆరోగ్యమును పాడుచేయును. అలసట, బలహీనత, ఆకలి మందం, నీరసము, చర్మ వ్యాధుల మరియు పళ్ల జబ్బులు...ఇవి ముఖ్యావశ్యకమైన విటమినుల మరియు ఖనిజముల లోటు వల్ల సామాన్యంగా సంభవించుచుండును. ఎంతో జాగ్రత్తయైన శ్రద్ధతో యోచించి తయారుచేయబడు ఆహారములందు సహితము ఇంకా ఈ విటమినులు, ఖనిజములను గురించి తరుచు లోపం కలుగును. శుభ్రమైన, పుష్టికర ఆహారమంతయు సంతులితమైన ఆహారము కానేరదు. అనేక విధాల ఆహారములందు విటమినులు ఖనిజముల లోటు వుండును, అట్టి సందర్భంలో మీ కుటుంబము ముఖ్యావశ్యకమైన విటమినులు, ఖనిజములు అన్నియు— సరియైన మోతాదులలో పొందుచున్నారని మీరు ఎట్లు నిర్ధారణ చేసుకోగలరు?

మీ కుటుంబములో ప్రతి ఒక్కరికిన్ని ఈ ముఖ్యావశ్యకమైన పుష్టికర పదార్థములను వారికి కావలసిన మోతాదులలో రూఢిగా లభించునందుకు వారికి విమ్‌గ్రన్-స్క్విబ్ మల్టివుల్ విటమినుల-ఖనిజముల బిళ్లలను ఇవ్వండి. రోజుకి ఒక్కటి ఈ ఆరోగ్యకరమైన అలవాటును నేటి నుండియే ఎందుకు ప్రారంభించకూడదు?

విమ్‌గ్రన్‌లో పదకొండు ముఖ్యమైన విటమినులు, ఎనిమిది ఖనిజములు సరియైన మోతాదులలో వున్నవి. ఎర్రని రక్తకణములను వృద్ధిపరచి శక్తిని కలిగించుటకు ఐరన్, ఎముకలను, పళ్లను దృఢముగా నుంచుటకు కాల్షియమ్, జబ్బును నిరోధించే శక్తిని బలపరచుటకు విటమిను సి, మంచి నేత్ర దృష్టికి మరియు ఆరోగ్యవంతమైన చర్మమునకు విటమిను ఎ, ఆకలిని పుట్టించి అంతర్శక్తిని పెంపొందించుటకు విటమిను బి12, అంతేగాక మీ కుటుంబ ఆరోగ్యము నిమిత్తం అవసరమైన ఇంకా ఇతర ముఖ్యమైన పుష్టికర పదార్థములు గలవు.

విమ్‌గ్రన్ ఒక్క బిళ్ల ఖరీదు సుమారు 13 పైసలు మాత్రమే. మీ కుటుంబ ఆరోగ్యము కోసం నిజంగా ఎంతో స్వల్ప ఖర్చు. ఈ దినమే విమ్‌గ్రన్ కొనండి—ప్రతి దినమూ విమ్‌గ్రన్ తీసుకోండి.

# విమ్‌గ్రన్®

విమ్‌గ్రన్ ఒక్క బిళ్లే
దినమునకు
మీకు పుష్టికరం

● ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్, ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులకు లైసెన్సు; దీనికి రిజిస్టర్డు ఉపయోగదారులు సారాభాయ్ కెమికల్స్ ...

SQUIBB® SARABHAI CHEMICALS

Shilpi SC 256 TEL

తెలిపించారు. మనిషి మనసును జయించగల మంచి మార్గమేదో వీరు నాకు చూపించారు... వీరు తప్పక నిలబడాలి... మిమ్మల్ని ఏకగ్రీవంగా పంచాయతీ అధ్యక్షులుగా ఎన్నుకునే ఏర్పాట్లు కూడా నేను చేస్తాను... కానీ... రవణ భారం కూడా యికముందు మీదే... వస్తాను... నా మాటకాదనక నామినేషను వదెయ్యండి...' అని చెప్పి జ్యోతి జవాబుకు కూడా ఎదురు చూడకుండా వెళ్ళిపోయిన వెంకట్రావు తమ పార్టీవాళ్ళందరితో మాట్లాడి ఒప్పించి, తను పోలీసులకు స్వయంగా లొంగిపొయ్యాడు ఆయుధంతో సహా.

* * *

'ఉషాదేవీ! ... లోపలకు రావచ్చునా?...'

నిద్రలేక ఎర్రగావుబ్బిన కళ్ళు, చెదిరిపోయిన జుట్టు, నలిగిపోయిన బట్టల్తో లోపలికి వచ్చాడు వేణు...

'కమిన్ వేణూ! కమిన్ ... నీకో శుభవార్త చెప్పడానికి నేనే రావాలనుకుంటున్నాను...' అతడి ముఖం చూడకుండానే, తన సంతోషంలో తను చెప్పుకుపోతోంది ఉష, వాచికి 'కీ' యిచ్చుకుంటూ.

'నీతో కొన్ని విషయాలు మాట్లాడుదామని వచ్చాను...'

'ఓ ప్లీజ్! ... ఇవ్వాళ నాకు చాలా సంతోషంగావుంది ... ముందునన్నే చెప్పనీ వేణూ ఎన్నో విశేషాలు...' ఉష వెళ్ళి ఫాన్ 'ఆన్' చేస్తూ అంది.

వేణు మౌనంగా కూర్చున్నాడు. ఉష వచ్చి ఎదురు కుర్చీలో కూర్చోబోతూ మళ్ళీ ఏదో జ్ఞాపకంవచ్చి. 'ఉండు... 'కుక్'కి కాఫీ చెప్పివస్తాను. అన్నట్టు ... కాబోయే అల్లుడుగారికి కాఫీ కావాలా?.... ఫ్రూట్ జ్యాస్ కావాలా?...' అంటూ అతడి కళ్ళల్లోకిచూసి నిశ్చేష్టురాలైంది... 'ఏం వేణూ!...ఎందుకలా వున్నావ్?...తలనొప్పిగావుందా? ... అయితే వేడివేడి కాఫీయే తెమ్మంటానుండు' అంటూ లోపలికి వెళ్ళింది ఉష.

లేడి పిల్లలా గెంతులువేస్తున్న ఉషా పిల్లతో ఏమని చెప్పాలి? ఎలా చెప్పాలో తోచక తలపట్టుకు కూర్చున్నాడు వేణు...

(ఇంకా వుంది)

# పెద్దకథ




'యివాళ సాయంకాలం మనింటికి వాళ్ళూ, వీళ్ళూ వస్తారు: కాస్త నర్ది నలుగురూ కూర్చునేందుకు చోటు చెయ్యాలి.' అంది రాణి ప్రొద్దున్నే యేడు గంటలకి బెడ్ టీ అందిస్తూ.

'వాళ్ళూ, వీళ్ళూ' అంటే అంతర్వేది తీర్థప్రజ అంతమూ కవచ్చి పడుతుందన్న సంగతి అప్పుడే పసిగట్టాడు వెంకట్రావు. యీ భూగోళాన్ని గోళీకాయనో, పసిఫిక్ మహాసముద్రాన్ని మసాబ్ టాంకనో పోల్చడంలో యేదో అలంకార ముందని చదువుకొన్నాడు చిన్నప్పుడు. అలాంటి అలంకారాలు రాణికి బాగావచ్చు. అసలు అవి లేనిదే మాట్లాడదు.

కాబట్టి 'వీళ్ళెవరు?' అన్నాడు ముక్తసరిగా.

'మహా తెలివిగా వీలుంటుంది: సైగా యిప్పుడింక వీళ్ళేదనుకొని చేసేదేంలేదు, అందరికీ ఆహ్వానపత్రికలు వెళ్ళిపోయాయి— శాండ్ పేపరుమీద గిల్ట్ అక్షరాల్తో!'

'ఈ యింటి యజమానిని నేను: నా యిష్టంలేకుండా యీ యింట్లో అడుగు పెట్టడానికి అడ్డమైనవాళ్ళకీ యెలా వీలవుతుందో చూస్తాను.'

'యీ యింటి యజమానురాలిని నేను: నా యిష్టంతో వస్తున్నారు వాళ్ళు. ఆ వచ్చే అడ్డమైన వాళ్ళని మీరు నిలువునా నిలబడి నిరభ్యంతరంగా చూడండిగాని, కాస్త యిళ్ళు పట్టారి!'

'వాళ్ళెవరు!'

'మిమ్మల్ని సత్కరించుకుంటారు నేను: [illegible] వాళ్ళకి [illegible] కొంచెం [illegible] తంగా ఉంటుందని ప్రార్థన. అప్పుడు ఊర్లో 'ఇటాలియన్ స్త్రయిబు వెళ్ళి' సినిమా ఆడుతోందిట. అలా యెవరో నన్నా కలిసి యే హోటల్లోనో మంచిమాట చేసుకొని, 12 గంటల షో చూసి మూడింటికి తిరిగిరండి.'

'నాన్సెన్స్! యింతకన్నా ఘోరమైన అన్యాయం, అక్రమం యింకోటుండదు. రోజురోజుకీ మరీ నీ జులుం యెక్కువౌతోంది!'

'యేమొచ్చిందిప్పుడు?'

'కట్టుకున్న మగాడికి తిండిపెట్టకుండా ఊరిమీదకి తరముతం, నాన్సెన్సు, అక్రమం, అన్యాయం, జులుం కాకపోతే, పతివ్రతా లక్షణం యేమిటి?'

'యిలా యింతకుముందు [illegible]

యింది కాదు ? యింట్లో చేస్తాను; ఉండమంటే వినిపించుకోకుండా యెవరో బాల్యమిత్రులు, ప్రాణస్నేహితులు, అర్థప్రాణాలు. వచ్చారని హోటళ్లని సేవించినప్పుడు యీ మాటలు గుర్తులేవేమిటి?'

'ఆ సందర్భం వేరు; పైగా నాయిష్టం మీద నేను బయటతినడం వేరు; నువ్వు పొమ్మనడం వేరు. ఏమైనాసరే, నేను యింట్లోంచి అంగుళం బయటికి కదలను! ఆపైన యింట్లో యీ సర్దడం వ్యవహారమేమిటో అంతుతేలుస్తాను!'

రాణి కొంచెంసేపు మాట్లాడ్లేదు. తలవంచుకుని నిలబడింది.

'యివాళ నాకు తలనొప్పిగా ఉంది; నేను తినడంలేదు. పైగా వాళ్లందరూ వస్తామంటే, సరేనన్నాను. యిల్లంతా యిలా ఉంటే బాగుండదు, సర్దాలి. యీ హడావిడిలో తీరికవదు; నామాట వినండి, ప్లీజ్.' రాణిస్వరం మారింది. కళ్లు బ్రతిమలాడాయి.

వెంటనే వెంకట్రావు మూడ్ మారింది. అలాంటి సందర్భాల్లో ఉన్నట్టుండి, దగా చేసేస్తూంటుంది, వెంకట్రావు మూడ్. మారిపోయిన మూడ్‌ని తిట్టుకుంటూ పక్కనుంచి లేచాడు.

పదిగంటలవేళ బయటపడబోతుంటే, రాణి మళ్లీ మొదలు పెట్టింది. మొదలు పెట్టేముందు వాతావరణం తయారు చేయడం రాణి కలవాటు. షర్టు వగైరా అందిస్తుంది. డబ్బు జేబులో పెట్టుంది. 'మంచినీళ్లు కావాలా' అంటుంది. అక్కర్లేక పోయినా ప్రక్కన పెట్టుంది.

ఆ వాతావరణం చూడగానే యేదో రాబోతోందని, 'ఊ, కానియ్యి' అన్నాడు రావు, బయటికిపోయే తొందరలో.

'ఊ, ఏమిటి కానివ్వాలి ?' అదోలా నవ్వింది రాణి.

'యెందుకీ ముసుగులు, పరదాలు! రెండేళ్లు కాపరంచేసిన పెళ్ళాంపిల్లని ఆ మాత్రం పుస్తకంలా చదివెయ్యలేకపోతే యీ చదువు, ఉద్యోగం అన్నీ హుసేన్ సాగర్లో కలిపేయొచ్చు !'

'అంత గొప్పగా అర్థం చేసుకునే కాబోలు యీ మాటలు, పనులు!'

'సెటైర్ గొప్పగా వదిలావుగాని, నువ్వు చెప్ప దల్చుకున్న దేమిటో వెంటనే చెప్పెయ్య. యెంత వేదయినా సరే, వినడానికి సిద్ధంగా ఉన్నాను.'

'యేంలేదు. మీరు మూడుగంటలకల్లా తిరిగివచ్చి, యింటిపట్టున ఉండి, కాస్త అందరికీ అవో యివో యిబ్బంది కలక్కుండా సర్దుబాటు చెయ్యడంలో సహాయపడాలి.'

'అంతే, యింటికొచ్చిన సుందరమ్మకి సోడా, వెంకాయమ్మకి గద్దెడు వేరుసెనక్కాయలు, శైలజకి శెనగపప్పు, పద్మావతికి పిడతకింద మసాలా శెనగలు, బంగారమ్మ మనమడికి బసుండలు, యిలాంటి వన్నీ సప్లై చేసే బేరర్ ఉద్యోగానికి నియమించావన్న మాట ! చాలా బాగుంది ! యీ జీవిత మింతటితో ధన్యమైంది ! యింక సెలవు పుచ్చుకోవచ్చు.'

'అదికాదు ; వాళ్లందర్నీ యింటికి పిల్చినప్పుడు వాళ్ల వీలుబాట్లు మనం చూడకపోతే, ఆ అవమానం మనదిగాదూ !'

'వాళ్లందర్నీ నేనేం పిలవలేదు ; పైగా 'మన' ఉన్నచోటల్లా 'నా' అని సవరించమని సలహా !'

'నా అవమానం మీది కాదేమిటి ?'

'లాజిక్ బాగుంది గాని, మూడుగంటలకి రావడానికి నాకు వీలుగాదు. నీ క్కావలసిన వన్నీ చూడ్డానికి అప్పారావున్నాడు, అప్పి ఉంది. యింకా పైన కావల్సొస్తే, యింకో నలుగుర్ని కిరాయికి మాట్లాడ్తాను. అన్నట్టు నేను మాట్లాడేదేమిటి ? నువ్వే కుదుర్చుకో.'

'రాలేక పోవడానికి యేమిటో అంత రాచకార్యం సెలవురోజున కూడా ?'

'సెలవెందు కిచ్చారు ? యివాళ మాకు రమ్మీ పండగ. రూపాయి స్టేకు. పైగా యితర క్లబ్బుల్నించి అతిథులు కూడా వస్తున్నారు ! యిలాంటిరోజు మళ్లీ జన్మలో రాదు ! ఏమయినా సరే తిరిగి రాత్రి తొమ్మిది గంటలయిందాకా యీ యింట్లో అడుగు పెట్టను. అప్పటికి మీ సమావేశాలు, చర్చలు అన్నీ ముగిసి అంతా యెక్కడిదక్కడ మామూలుగా ప్రశాంతంగా ఉండాలి.'

'అంతే నన్నమాట. కానీండి !' రాణి లోపలికి పోయింది.

యిన్నాళ్టికి చాలా కటువుగా, నిర్భయంగా రాణికి ఆమె ఉండాల్సిన హద్దులు చూపించి, గిరగీసి అందులో ఉంచగలిగి నందుకు చాలా గర్వంగా ఉంది. యెప్పుడో ఒకప్పుడు; అప్పుడప్పుడు తన ఆధిక్యతని, అధికారాన్ని యింట్లో బుజువుచేసుకుంటూండక పోతే మగాడన్నవాడు, ఆడదానికి లొంగి, బానిసయిపోయి అరమెట్లలోతు దిగిపోతాడన్నది రావు సిద్ధాంతం. అలాంటి సమయం యిప్పుడొచ్చింది. తననితాను ఎస్సర్ట్ చేసుకో గలిగాడు. యింకేం కావాలి ?

'ఏమిటండీ, క్రిందికి చూడకుండా ఛాతీ అంత యెత్తు పెట్టుకు నడుస్తున్నారు?' జోకేశాడు సుబ్బారావు. వెంకట్రావుకున్న అరో ప్రాణాల్లో సుబ్బారావొకడు.

'చూడండి, జీవితం మొత్తం మీద మహా రసవంతమైన సమయాలు బహు కొద్దిగా వస్తాయి. అవి వచ్చీ రాగానే అట్లా బిగించి పట్టుకొని మన మేలుకి ఉపయోగించుకోవాలి. అలాంటి దివాళ ఒకటొచ్చింది. యిట్టే రెక్క పుచ్చుకొని ఉపయోగించుకున్నాను. చాలా సంతోషంగా ఉంది.'

'నన్నూ పంచుకోనివ్వండి, మీ చాలా సంతోషాన్ని !'

'మహిళా సంక్షేమ మంటూ భారత ప్రభుత్వం మొదలెట్టినప్పట్నుంచీ, అది కాస్తా పురుష సంక్షోభానికి యీజీక్వల్టు అయి కూర్చుంది. ఊరూరా, వాడవాడా కార్మికోద్యమంలాగ, మహిళా సంఘాలు, సమావేశాలు, ఉపన్యాసాలు, రేడియోల్లో బాకా ఊదడం - ఒకటే బోర్!'

'యిదంతా నాంది; యిహ ప్రస్తావన కానియ్యండి.'

'రాణి నన్ను యింట్లో కట్టేయాలని చూసింది. నాన్సెన్సని లేచి వచ్చేశాను.'

'హుష్, కాస్త నెమ్మదిగా అనండి. రమ వింటుంది !'

'యింట్లోనే ఉన్నారేమిటి ?'

'యింట్లోనే ఉంది. సాయంకాలం జరగబోయే వాళ్ల మహిళా మండలి మొట్టమొదటి సాధారణ సంఘ అసాధారణ సమావేశానికి యే చీర కట్టుకోవాలో, యే ముడి వేసుకోవాలో, యే బొట్టు దిద్దాలో, కళ్ళకి రంగు యెక్కడిదాకా పట్టించాలో ఆరోచిస్తోంది. అన్నట్టు ఓ శుభ వార్త! యివాళ మన కింట్లో భోజనం లేదు! ఆవిడ తయారుగావడం హడావిడిలో నన్ను బయట తినమంది.'

# ఘెరావ్

'నా పని అంతే! ఆవిడలా బయటకి పొమ్మనగానే మహా సంతోషమైంది లెండి. యింతకన్నా పర్వదిన మెక్కడినుంచొస్తుంది? పదండి, క్లబ్ కేసి వెళ్దాం. యివాళ లాంగెస్ట్ సెషన్ వెయ్యాలి!'

యిద్దరూ క్లబ్‌కి చేరగానే అక్కడ అప్పటికే రామశాస్త్రి, కృష్ణమూర్తి, షౌకత్ ఆలీ, నారాయణరావు, హనుమంతరావు, నరసింహారావు, జాకబ్, అల్తాఫ్ హుసేన్, జాన్ సుందర్రావు, పీటర్ మనో రంజన్, సయ్యద్ మహమ్మద్ ఇర్షాద్ హుసేన్ అష్రఫ్, సత్యవీర వెంకట శివశితా రామాంజనేయరాజు, మొదలైన బంధుమిత్ర గణమంతా చేరారు.

'మా ఆవిడ అధ్యక్షోపన్యాసం వ్రాసుకొని రిహార్సలేస్తోంది, అందుకు నన్ను బయటికి పొమ్మంది!' అన్నాడు సిద్దారెడ్డి.

'ప్రొద్దున్నుంచి జమా ఖర్చులు లెక్క చూస్తోంది గాని యిప్పటివరకూ అంతు బట్టలేదు! చివరికి ఆ విసురంతా నా మీద చూపెట్టింది!' నవ్వాడు కామరాజు గుప్త.

'సాయంకాలం సభలో మా బేగం ఘజల్ పాడుతుందిట! అందుకని వారం రోజుల్నించీ నా కింట్లో నిద్రలేదు!'—షౌకత్ ఆలీ.

'మీ బేగం ఘజల్ అయితే, మా బేగం లలితశాస్త్రీయ గానం! దారులు వేరుగాని గమ్యం ఒక్కటే!'—రామశాస్త్రి.

ఒకరు కెమెరా యేర్పాట్లో ఉంటే, మరొకరిది టీ యేర్పాటు! మొత్తానికి స్త్రీ జనమంతా హడావిడిగా ఉన్నారు.

'ఏమయితేనేం, యింతటి అద్భుతావకాశాన్ని మనకిచ్చి యిలా అఖండ రమ్మీ కార్యక్రమం యేర్పాటు చేసుకో తోడ్పడిన అందరి శ్రీమతులకి ఈ క్లబ్ తరఫున కృతజ్ఞతాభినందన లందజేస్తూ ఓ తీర్మానం అచ్చొత్తించి వాళ్ళ సమావేశారంభ సమయానికి అందిస్తే!' అన్నాడు మూర్తి.

'అదలా ఉంచి ఈ సందర్భాన్ని మనం సెలిబ్రేట్ చెయ్యాలి!' అన్నాడు నరసింహరావు

అందరూ 'బ్రిలియంట'ని మెచ్చుకున్నారు. చిల్డ్ కింగ్ ఫిషర్ బీర్ గ్లాసుల్లోకి ప్రవహించింది. ఎవరి ఓపికల్నిబట్టి వాళ్ళు బ్రిడ్జి, రమ్మీ, ఫ్లాష్ టేబుల్స్ ముందు కూలబడ్డారు. స్నాక్స్, ఛాటో నట్స్ వగైరా రావడం ఆగకుండా యేర్పాటు చేసే బాధ్యత వెంకట్రావుదయింది.

వెంకట్రావు, మూర్తి, రాజు, రెడ్డి, చౌదరి, జాన్, అష్రఫ్, ఆలీ కలిసి రమ్మీ ఆడుతున్నారు.

'యింతకీ ఈ సమావేశంలో ఈ మహిళామణులంతా చర్చించి తీర్మానించే దేమిటో?' డ్రాప్‌చేసిన అష్రఫ్ మొదలెట్టాడు.

'ఈ యిరవైఒకటి జూన్ పంథొమ్మిది వందల అరవైయేడు, బుధవారం సాయంకాలం భారత కాలమాన ప్రకారం నాలుగున్నర గంటలకి, అఖిల ప్రేంనగర్ మహిళా మండలి తొలి సాధారణ సంఘ అసాధారణ సమావేశం, స్వంత భవనాలు లేని కారణాన తాత్కాలికంగా యేర్పాటు చేయబడిన చోట జరిగి,

'పశ్చిమ ఆసియాలో యిజ్రాయిల్ దురాక్రమణని గుర్తించి,

'భారత దౌత్యోద్యోగులపట్ల చైనీయుల అసభ్య ప్రవర్తనని చర్చించి,

'నాలుగో పంచవర్ష ప్రణాళికలో చలనచిత్రోద్ధరణకై కేటాయించిన నిధుల్ని విమర్శించి,

'సెకడ్ ప్రే చలనచిత్రంలో అతిఫికన్న కభ్యంతరకరమైన దృశ్యాలు పరిశీలించి,

'ఈ భారతదేశంలో మహిళల పురోగమనాన్ని ప్రతిఘటించే అభివృద్ధి నిరోధక శక్తుల్ని నిరసించి,

'వారంరోజుల క్రితం బూల్‌చంద్ షాప్‌లో కొచ్చిన విజయ్‌లీన్ జ్లాజ్ పీసెస్‌ని సందర్శించి

'రెండు రోజులక్రితం యెవడో కాలేజీ అబ్బాయితో పరారయిన కన్యకాపరమేశ్వరి గురించి గుస గుసించి—

'సదరు ఇజ్రాయల్ దురాక్రమణ తక్షణం విరమించాలని,

'సదరు అసభ్యకర ప్రవర్తనకి పరిహారంగా చైనీయులు డెబ్భైకోట్లమందీ, భారతీయులు యాభైకోట్లమందికి విడి విడిగానూ, కలిసి క్షమాపణ వేడుకోవాలనీ,

'సదరు ప్రణాళికలోని సదరు నిధుల్ని నాలుగురెట్లు చేసిందాకా ఆజన్మాంత నిరశన వ్రతం ఆతర్వాత అగ్నిప్రవేశం చేయగలమని భారత ప్రభుత్వాన్ని బెదిరించాలని!

# షేరావ్

'సదరు చలనచిత్రంలో అభ్యంతరకరమేమీ లేనందున దేశమంతా ఉచితంగా ప్రదర్శించాలని,

'సదరు అభివృద్ధి నిరోధక శక్తుల్ని చీల్చి చెండాడేందుకు, మహిళా రక్షణదళాల్ని యేర్పాటుచేసి, తద్వారా స్త్రీలలో ఉద్యోగావకాశాలు పదింతలు చెయ్యాలని,

'సదరు బ్లాక్ పీసెస్ కొనిచ్చేదాకా భర్తల్నెవర్నీ దగ్గర జేరనియ్యకూడదనీ, స్నేహితులతో సినిమాలకి, పేకాట్లకి వెళ్ళకుండా అడ్డుపడాలనీ,

'సదరు అబ్బాయి గురించీ, అమ్మాయి గురించీ సభ్యురాండ్రందరూ వీలయినప్పుడల్లా, వీలుచేసుకొని, ఆలోచిస్తూ, మాట్లాడుతూ, చర్చిస్తూ, తెలియనివాళ్ళకి చెబుతూ, యిహమీదట అలా యెవరన్నా చెయ్యాలనుకొనేవాళ్ళకి ఉపయోగపడేందుకుగాను కావల్సిన సమాచారం, భోగట్టా సేకరించి కూర్చాలనీ, తీర్మానించడమైనది!' రామశాస్త్రి వల్లించాడు

'డ్రాఫ్ట్ వినాదేలాగుందే ?' ఆలీ అడిగాడు.

'నాదికాదు; మా శ్రీమతిది. వాళ్లనాన్న పెద్ద డిప్లొమాట్. ఆవిడ వ్రాసేది అలాగే ఉంటుంది.'

'అసలు, మనకీ ఓసంఘముండాలండీ. జనాభాలో మైనార్టీలం మనం. అధిక సంఖ్యాకులకే ఉండగాలేంది, మనకిడుంటే తప్పేమిటి? కాస్త గప్పాలు కొట్టుడానికి యిలాంటి దేదో ఉండాలి!'

'యీ క్లబ్ చాందేమిటి?'

'క్లబ్ అంటే బూర్జువా కంపు కొడ్తోంది! చక్కగా 'అఖిల ప్రేంగర్ పురుషుల సంఘం' అంటే అది మోడర్న్‌గా ఉంది.'

'అయితే. యీ సంఘంలో కార్యకలాపాలు గూడా సరిగ్గా ఆధునిక సంఘాల్లోలాగే ఉండాలి. నినాదాలు, బల్లగుద్దడం, జండాలు, కాగితాల తోరణాలు, ఊరేగింపు, వేడెక్కే ఉపన్యాసాలు, ఉద్రేకపూరితమైన పాటలు అంతా ఒకటోరకంగా ఉండాలి. క్లబ్ సాంవత్సరిక తద్దినాల్లాగా పాపుగింటకొకటి చొప్పున తాగితేనేగాని మెల్లకువుండనట్టుండకూడదు!' హుషారుగా అన్నాడు పీటర్ మనోరంజన్.

'అంతా మీ మీ ఆటలుకట్టేసి ఇలా వేదికముందు కూర్చో ప్రార్థన.' మూర్తి సంఘసమావేశానికి పన్నెండు రెండు బిడ్జి టేబుల్స్ కలిసి వేదిక తయారుచేసి దాని మీదో కుర్చీవేసి అందర్నీ పిల్చాడు.

మహిళామండలి అసాధారణ సమావేశం ధర్మమా అని, ఆరోజు క్లబ్‌లో హాజరు సంఖ్య యెప్పటికన్నా యెక్కువగా ఉంది. అందరికీ అప్పటికప్పుడే రెండు బాటిల్సు దాకా ఖాళీ అయ్యాయి. అంతా కుర్చీలు లాక్కొని ముందుకూర్చొన్నారు.

'సోదర మహాశయులారా,

యీనాడిలా మిమ్మల్నందర్నీ నా ముందు కూర్చోమని కోరడానికి ఓ ప్రబల కారణముంది. యీరోజింతమంది పరువుగల పెద్దమనుష్యులం, విద్యాధికులం, ఉన్నతోద్యోగులం, సమాజంలో ఓ స్థాయి, పరపతి, హోదా గలవాళ్ళం, పిడికెడు మెతుకులు, కొద్దిక్షణాల కునుకు కరువై యిలా దట్టుపడి రచ్చకెక్కి గూడుపోయిన పక్షుల్లా,—'

'రైలు తప్పిన ప్రయాణీకుల్లా'–మధ్యలో చెప్పాడు జాన్.

'రైలు తప్పిన ప్రయాణీకుల్లా యేం చెయ్యాలో తోచని యెటూ పోవీలుకాని పరిస్థితిలో తల్లడిల్లుతున్నామంటే, కొట్టుకుంటున్నామంటే యీ దౌర్భాగ్యానికి, అవమానకర పరిస్థితికి కారకులెవరు? యీ ప్రశ్న కొరకంచులా మనందరి ముందు నిలబడింది. నాలాగే మీరందరూ ఆవేదన చెందుతున్నారని, మీ మనసులూ కుతకుత లాడుతున్నాయనీ నాకు తెలుసు. కాబట్టి, నేను కోరేదేమంటే మీరంతా యీ విషయమై విపులంగా చర్చించి, అందరికీ సమ్మతమైన నిర్ణయాలు చెయ్యాలి తర్వాత జరగాల్సిందంతా మీకే వదులుతున్నాను.' రామశాస్త్రి అధ్యక్షాసనం అధిష్ఠించి ప్రారంభోపన్యాసం కావించాడు.

'ముందు ప్రార్థన ఉండాలి!' కృష్ణమూర్తి సలహా.

అంతా లేచి నిలబడ్డారు.

'లేరా, మగవాడా! నీ స్వాతంత్ర్యం గంగలో కలిసిపోయే విషమ ఘడియ లొచ్చాయి! నడుం కట్టి, ముందంజ వెయ్యి! నీ శత్రువుల్ని మట్టుబెట్టు. ఆడొచ్చె రాకాసుల్ని రాబందుల్ని యెగరతన్ను!...' అంటూ ఆశువుగా ఓ ప్రార్థన గేయం అప్పజెప్పాడు రంగారావు...

'అధ్యక్ష, సోదరులారా!

వాతు మొదట్నుంచీ మెత్తటివాణ్ణి,

సౌమ్యుణ్నని, ఓర్మిగలవాణ్నని, మా యింట్లోనే కాకుండా, చుట్టుపట్ల అంతటా గూడా మంచిపేరు. అలాంటి నన్నే రెచ్చగొట్టి, విసుగెత్తించి, యిలా బయట చెప్పుకొనేట్టు జేసిన సంఘటనలు జరుగుతున్నాయంటే, అతి శోచనీయమైన, హృదయ విదారకమైన సంగతని చెప్పడానికి చింతిస్తున్నాను. మాయింట్లో రోజూ జరిగే చిన్న చిన్న విషయాల్లాంటివే మీ అందరి యిళ్లల్లోనూ జరుగుతూంటాయనే ఉద్దేశ్యంతో కొన్నిట్ని యిప్పుడు ముచ్చటించ దల్చుకున్నాను. వీటినిబట్టి పరిస్థితి యెంత విషమించిందో అర్థం కాగలదు.

మా కుటుంబంలో అందరికీ సంగీతమంటే మహా యిష్టం. మా నాన్నగారు, ద్రుపదా, తుమ్రీ, ఖయాల్‌లాంటివంటే చెవి కోసుకునేవారు. ఆ రికార్డులన్నీ యేర్చి ఆల్బంలో పొందికగా కూర్చి ఉంచారు. నాకూ సంగీతంలో కాస్తో కూస్తో ప్రవేశమూ అభిరుచీ ఉన్నాయి. బడేగులాం ఆలీ ఖాన్ తుమ్రీలంటే నాకెంతో యిష్టం. అలా గంటలకొద్దీ విన్నదే మళ్లీ మళ్లీ వింటూంటే పరవశించిన మనసు యెక్కడో యీ లోకానికి, పరిసరాలకి చాలా యెత్తున తేలిపోయేది. అలాంటి నా రికార్డులన్నీ ఓరోజు నాతో చెప్పకుండా, ప్లేట్లు సాసర్ల క్రింద మార్పించేశారు, మా యింట్లో. అంతేగాదు. నాగది గోడలనిండా వేలాడదీసిన నా ఫోటోలు, పాలుతాగేప్పటివి, పాకుతున్నప్పటివి, అప్పుడప్పుడే నడుస్తున్నప్పటివి ఆటలపోటీల్లో గెల్చినప్పటివి, యేవో తను రాగానే ఊడదీసి ఒక్క పెళ్లి ఫోటో తగిలించి ఊరుకున్నారు! మిగతా అంతా ఆనవాలైనా లేకుండా డిస్టెంపరు కూడా కొట్టేశారు. యివన్నీ చాలా చిన్న చిన్న విషయాల్లాగ కనబడవచ్చు. కాని యిలాంటివి రోజూ జరుగుతూంటే ఆఫీసుల్లో శ్రమదానంచేసి యిళ్లకొచ్చిన జీవుల్లని యెంత క్రుంగదీస్తుందో యోచించండి. అందుచేత యీ సమావేశం చాలా ముఖ్యమైందని, యిక్కడ మనం యిక ముందేం చెయ్యాలో ఆలోచించి నిర్ణయించాలని, యీ మహాసభకి విన్నవించుకుంటున్నాను.'

అష్రఫ్ ఉపన్యాసమయ్యాక, రంగారావు వేదిక యెక్కాడు, కరతాళ ధ్వనులమధ్య.

'అధ్యక్ష, సోదర మణులారా!

యీ నాటి మన యీ దౌర్భాగ్య పరిస్థితి ఒకవిధంగా చూస్తే మనం కల్పించుకున్నదే. ఆడది అన్నది కలం పట్టగానే, ఓహోహో' అని ఊరేగించాం. ఏ పరీక్షో పాసయితే అదో ఘనకార్యమన్నట్టు ఆకాశానికెత్తాం. ఏదన్నా ఉన్నత పదవిలో ఉంటే 'ఆహాహా!' అని చుట్టూజేరి భజనచేశాం. రకరకాలుగా వాళ్లని నెత్తికెక్కించుకున్నాం.

అంతెందుకు? అసలు యీ ఉపన్యాసాలు యెవడు మొదలెట్టినా 'సోదర సోదరీ మణులారా!' అంటాడుగాని 'సోదరీ సోదర మణులారా!' అని ఛస్తే అనడు. అక్కడికి ఆ మణులన్నీ వాళ్లే అయినట్టు, వీళ్లుగానట్టు! పైగా ఆడది కనబడగానే సీట్లోంచిలేచి కూర్చోబెడతాడు. గుమ్మం దగ్గర అడ్డు తొలగి ముందు యెక్కనిస్తాడు, ముందు దిగనిస్తాడు. కాలేజీల్లో వాళ్లకి సీట్లు రిజర్వ్‌డ్. అసలు కాలేజీలే రిజర్వ్‌డ్. ఉద్యోగాలు రిజర్వ్‌డ్. రైలు పెట్టెలు రిజర్వ్‌డ్. వెయిటింగు రూంలు రిజర్వ్‌డ్. మంత్రి పదవులు రిజర్వ్‌డ్. సినిమా హాల్లో సీట్లు రిజర్వ్‌డ్; కొన్నిచోట్ల గేట్లుకూడా రిజర్వ్‌డ్. సైకిళ్లవాళ్లకి ప్రత్యేకం. గొడుగులు ప్రత్యేకం. పత్రికల్లో వాళ్లకి పేజీలు ప్రత్యేకం!

యింతజేసి కూడా, వాళ్లు మనపై సవారి చేస్తుంటే, పసిపిల్లలు గంతులు వేసినప్పుడు చూసి మురిసినట్టు తన్మయించాము. శెభాష్ అన్నాం. పద్మశ్రీలు పంచిపెట్టాం.

పూలదండలు వేశాం. బాండ్ మేళాం పెట్టి ఊరేగించాం వాళ్లగొప్ప అంతా మన గొప్పే అని, మనదేశంలో స్త్రీలింత గొప్ప దశలో ఉన్నారంటే మగాడితో సమానంగా ఓటువేస్తున్నారంటే యిది మానాగరికతకి సభ్యసంస్కృతులకి, తెలకపిండికి నిదర్శనమని లాషా మర్కా వీలయినచోట్లల్లా వాయించాం. అయితే జరిగిందేమిటి?

'సత్యభామ మాది, మొల్ల మాది, ఝాన్సీ లక్ష్మీబాయి మాది, మేరీ క్యూరీ మాది, పెర్ల్‌బక్ మాది యింత గొప్ప వాళ్లమైన మమ్మల్ని యీ నాటి మగాడు ఆవకాయ జాడీకి, దేవుడిపెట్టెకి అంకితం చేసి కూర్చోబెట్టాడు, మొర్రోమని వాళ్లు మెళ్లో డోలు కట్టుకొని అదేపనిగా మ్రోయిస్తున్నారు. దానికి జవాబుగా, 'శ్రీకృష్ణుడు మా వాడు, శ్రీనాథుడు మా వాడు, శివాజీ మావాడు, ఆపెన్ హీమర్ మావాడు, టాగోర్ మావాడు' అన్న మగవాడు ఒక్కడులేడు. అక్కడేఉందీ తేడా.

అందుకే యీ తంటా మనం తెచ్చుకున్నదే అంటాను. మనం తెచ్చుకున్నదే గాబట్టి, దీన్ని మనం పరిష్కరించ గలగాలి, నిజంగా, మనలాంటి వాళ్లకిదొక సమస్య కానే కాదు.

సోదరులారా! మీరు చూసి బయపడుతున్నది ఉత్త కాగితం పులి. లోక మెరిపెడ్తే మూడు పల్టీలు కొట్టి మూలబడుతుంది. కాబట్టి మీ రంతగా పట్టించుకోవాల్సిన అవసరం యేం లేదు. అయితే యీ తోక మెలి పెట్టే దెలాగ అని మన మిప్పుడు ఆలోచిద్దాం. బొమ్మ బొమ్మలాగే చూడ్డానికి తమాషాగా ఉండాలి. కాని యిలా అసలైందానిలాగ రంగులు పూసుకోగూడదు. దాని హద్దులు తెలుసుకొని వాటికే పరిమితమయ్యేలా చెయ్యాలి. యింతటితో విరమిస్తాను.' మళ్లీ సభలో కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

మూడోవాడుగా నర్సింహారావు, నాల్గోవాడుగా షౌకత్, ఆ తర్వాత వెంకట్రావు, సుబ్బారావు, సుందర్రావు, సిద్ధారెడ్డి అంతా అయ్యాక రాజు మొదలుపెట్టాడు—

'అధ్యక్ష మహాశయా, సోదరులారా!

యీ నాడు మనల్ని యెదుర్కొంటున్న సమస్య యిలా యేదో ఆషామాషీగా, టీ త్రాగుతూ బ్రిడ్జి టేబిల్సుమీద చర్చించాల్సింది గాదు. యిది యావద్భారతాన్ని యెదుర్కొంటున్న సమస్య. స్త్రీలు సౌందర్య స్వరూపులు. కళాఖండాలు అని ఒకనాడు పనిలేని మన పెద్దవాళ్లు పసలైన బజార్జునా ధోరణిలో పుస్తకాలు, కావ్యాలు, శిల్పాలు, చిత్రాలు వగైరాల్లో పతిగా పొగిడేయడం వల్లా, సుస్మితలు, సరళ స్వభావులు, శాంతమూర్తులు, భూదేవి ముద్దుబిడ్డలు, సీత సావిత్రి అనసూయలాంటి పెట్టుబడిదారీ దేవతమ్మల వారసులు, గాడిద గుడ్డు అనీ కితాబు లియ్యడంవల్లా, సరాసరి నెత్తికెక్కనియ్యడం వల్లా, యీ నాడు యీ అనర్థం యేర్పడింది.

సౌందర్య స్వరూపు లన్నవాళ్లు సౌందర్యా

# కొనండి ఈ మర్ఫీ ట్రాన్సిస్టర్లలో దేనినైనా



మర్ఫీ మోడెల్ టిఱి 0816
అల్‌వేవ్ • 3 బ్యాండ్ • 9 ట్రాన్సిస్టర్లు మరియు డయోడు.
ధర రు. 415.00*



మర్ఫీ మిని-మాస్టర్, మోడెల్ టిఱి 0581
9 ట్రాన్సిస్టర్లు మరియు డయోడ్లు * 2-బ్యాండ్ రావడంలో 3 బ్యాండ్లకు సమానము) ఎం డబ్ల్యు మరియు ఎస్ డబ్ల్యు రిసెప్షన్ కొరకు బిల్ట్‌ఇన్ ఏరియల్,
ధర రు. 303.00*



మర్ఫీ మిగ్, మోడెల్ టిఱి 0579
2-బ్యాండ్ • 8 ట్రాన్సిస్టర్లు • మరియు డయోడు. బిల్ట్‌ఇన్ ఫెర్రెట్ ఏరియల్ • కచ్చితముగా ట్యూన్ చేసేందుకు ఎపిసైక్లిక్ రిడక్షన్ గేరింగ్.
ధర రు. 240.00*

భారతదేశమంతటా ధర: (మహారాష్ట్ర తప్ప) ఎక్సయిజు సుంకము మాత్రమే కలుపుకొని బ్యాటరీ ధర మినహాయించి. అమ్మకపు పన్ను మరియు ఏ యితర స్థానికపు పన్నులైనను అదనము.




మర్ఫీ మ్యుజీషియన్ మోడెల్ టిఱి 0509
6 ట్రాన్సిస్టర్లు మరియు డయోడ్లు మీడియం వేవ్ ఒక బ్యాండు బిల్ట్‌ఇన్ ఫెర్రైట్ ఏరియల్
ధర రు. 125.00*
ఎక్సయిజు సుంకములేదు

(NAS 6143d A)



**murphy** మర్ఫీ మీ శ్రవణానికి ఆనందాన్నిస్తుంది!

*Murphy sets the standard*

రాధకులై పుస్తకాలు వ్రాసి, కళా ఖండా లయిన వాళ్ళు కళాసృష్టిచేసి, కార్మికులు ఫాక్టరీలు పెట్టినట్టు కంచే చేను మేసినట్టు సామ్రాజ్యవిస్తరణ వాద ధోరణి ననుసరించి మన ప్రాథమిక హక్కులికి భంగం చేయబూనడం జరిగిందంటే యిది మనందరికీ సిగ్గుచేటు. మన మనుగడకే ఒక సవాలు. పొగరుబట్టిన ఆబోతులా రంకెలు వేసే యీ సవాలుని యెదిర్చి నిలబడి కొమ్ములు మెలితిప్పుతామా లేక ఆడవాళ్ళు వదిలేసిన గాజులు తగిలించుకొని పారిపోతామా అన్నదే మన ముందున్న ప్రశ్న (హియర్, హియర్. సభలో కలకలం.)

మనలో యెంతమందికి దమ్ములున్నాయి, రాత్రి తొమ్మిది దాటాక యింకా యిక్కడే ఉండి రమ్మీ ఆడ్డానికి? ఉన్నవాడు, అలా చేసేవాడు, యింట్లో ఫర్నిచర్, క్రాకరీ, కట్లరీ, లైబ్రరీ అన్నీ భరతనాట్యం, కథాకళి, నిలయవిద్వాంసుల వాద్యసమ్మేళనం లాంటి వెన్నో ఉమ్మడిగా కలిసి చేసెయ్యవా? పెళ్ళికాకముందు క్లబ్ బోయ్ గోలపెట్టినా వినక తాళం చేవులు పుచ్చుకొని వాణ్ణి పంపించేసి, రాత్రి మూడింటిదాకా పేకాడిన మనం, యీ రోజు అతి కష్టంమీద యెనిమిది దాటినా ఉంటున్నామంటే, యీ ఆంక్షలు యెవరు విధించారు? దేశాన్నుంచి పోడానికే పాస్‌పోర్టు నిరాకరించడం ప్రాథమిక హక్కులకి భంగమని సుప్రీంకోర్టు తీర్పిస్తే, యింట్లోంచి మన రాకపోకలమీద ఆంక్షలు విధించడానికి యెవరిచ్చారు హక్కు యీ ఆడవాళ్ళకి? ఏమిటీ నిరంకుశత్వం?

అంతేగాదు, క్రొత్త సినిమా వస్తే మొదటిరోజే డ్రెస్ సర్కిల్లో రిజర్వు చేయించాలి లవిస్ట్రల్లో, కింగ్స్‌వేలో తాజా ఫాషన్లు అన్నీ చూసి సరిగ్గా ఆ మాదిరివే కొని తేవాలి సాయంకాలం పేపరు చదవడం మానేసి వీళ్ల అడ్డమైనగాసిప్పూ వినాలి సెలవులొస్తే క్లబ్ మాట మర్చిపోయి, కనీసం యే గండిపేటకో పిక్నిక్ వెయ్యాలి. యేమిటీ దౌర్జన్యం? యీ నియంతృత్వం యెన్నాళ్ళిలా కొనసాగడం? మగవాడు మగాడిగా నిలబడి, తన ప్రాథమిక హక్కుల

# ఘెరావ్

కోసం పోరాడి సాధించేదెప్పుడు?

సోదరులారా, నిరాశపడకండి పీడితజాతులు యెంతకాలమో పీడితంగా ఉండిపోవు. అదుగో, గంటలు వినబడుతున్నాయి: రథ చక్రాలొస్తున్నాయి. తూరుపుదిశ యెర్రబారుతోంది. అంగ్రదొక్క బడ్డ శక్తులన్నీ కూడగట్టుకొని విజృంభించి, యీ నిరంకుశత్వానికి, మంగళం మహత్ శ్రీశ్రీ చెప్పే శుభఘడియ లొస్తున్నాయి యీ అరాచకం, యీ శుష్కనినాదాలు, యీ అభివృద్ధి నిరోధక ఉద్యమాలు, యీ తిరోగామి సంఘాలు—యింకానా? యికపై సాగవు! (వహ్వా, వహ్వా అంటూ పెద్దపెట్టున చప్పట్లు.)

అందుకు యీ రోజునుంచే నడుంకట్టి ముందుకు సాగుదాం. యిదొక మహోద్యమంగా, పురోగామిశక్తిగా, సాంస్కృతిక విప్లవంగా రూపొందించి ముందుకిసాగుదాం. అడ్డొచ్చిన వెంగళప్ప లెవరన్నా ఉంటె నిశ్శేషంగా నిర్మూలించిందాకా విశ్రమించబోం!

విప్లవం వర్ధిల్లాలి! బల్ల గట్టిగా గుద్ది రాజు దిగాడు.

కొద్దిసేపు సభికులంతా దిగ్భ్రమలో అదే వరసన చప్పట్లు చరుస్తూ ఉండిపోయారు.

'విప్లవం వర్ధిల్లాలి!' అంతా గట్టిగా అన్నారు.

'ఇంక్విలాబ్ జిందాబాద్!' అన్నారు మళ్ళా.

'కల్చరల్ రివొల్యూషన్—హిప్—హిప్ హుర్రే!' అని గూడా అరిచారు.

ఆ రభసంతా అణిగాక, యీ సాంస్కృతిక విప్లవం నడిపేదెలాగు? వెయ్యిపూవులు పూశాయన్న ధోరణిలోనా? యింకోలాగా? దీన్ని యెలా తీర్చిదిద్దాలి? లక్ష ప్రశ్నలు లేచాయి

'మీరు కాలేజిలో ఉన్నప్పుడు కథలు, గేయాలు వ్రాసేవారుగా! అన్ని వార, మాస పత్రికల్లోనూ ప్రచార కథలు, ప్రచార నవలలు, ప్రచార గేయాలు వ్రాసేయండి!' అన్నాడు సుబ్బారావు, వెంకట్రావుతోటి.

'నే నేదో గిలికినమాట వాస్తవమేగాని, అని యింతవరకూ యే వార మాసపత్రికలకీ వెళ్లలేదు! పైగా వెళ్లినవేవో వారంలోపలే అమ్మేసిన ఆవు దూడల్లాగా పరుగెత్తుకొచ్చేశాయి!'

'ఆమాటకొస్తే, అటువైపు మత్తకోకిల గారున్నారు; ఆవిడ నిమిషానికోగేయం, గంటకోకథ, రోజుకో నవల చొప్పున వ్రాసేసి, తెలుగుదేశంలో ఉన్న వార, మాసపత్రిక లన్నిట్లోనూ కురిపించేస్తుంటుంది!'

'అది చాలాప్రమాదం. బెడిసికొట్టగలదు. కాబట్టి ఓ మాంచి సాంస్కృతిక కార్యక్రమం యేర్పాటుచేసి, సంగీత కచేరీలు నాటకాలద్వారా మన ప్రచారం సాగిద్దాం.'

'అలా చూసినా ప్రసూనాంబ, రాజ రాజేశ్వరి, మందారమాలలాంటివాళ్లు అన్ని ఊర్ల వేదికలమీద, రేడియోల్లోనూ, అన్ని రాగాల్లోనూ మీ మాట లెవరికీ వినబడకుండా పాడేయగలరు. యిహ ఆడవాళ్ళు లేని నాటకాలు చూసే మగవాడు యిక మీదట పుట్టాలి!'

'మందారమాలగారు గాన కోకిలయితే, జాన్ సుందర్రావుగారు తబల మార్తాండుడండీ! కాబట్టి సంగీత కచేరీ జరగాల్సిందే!'

'సుందర్రావుగారు తబలమీద విప్లవ ప్రచారం మొదలెడ్తే యెదురుగ్గా చాప పర్చుకొని మానిందాకా నిరాహారదీక్ష సాగిస్తారు ఊర్లోవాళ్ళు!'

'యింకెలాగ?'

అంతా తీవ్రంగా ఆలోచించారు.

'ఘెరావ్' అన్నాడు రామ్మూర్తి గట్టిగా.

'ఆయ నెవరు?' అని అటూ యిటూ చూశాడు రామశాస్త్రి.

'ఘెరావ్ అంటే యే రావూ గాదండి. అదో కొత్త ఉద్యమం.'

'అంటే యేం చెయ్యాలో చెప్పండి, యిలా వొచ్చి.'

(ఇంకా ఉంది)



# ఎందుకని?
## పద్మనాభం

సెన్సారు అధికారులు సినిమాచూస్తున్న సమయంలో హాస్యసంఘటనలువచ్చినప్పుడు ప్రేక్షకులకు మల్లే బాధలన్నీ మరచిపోయి నవ్వుతారా, లేక వాళ్ల కత్తెరకున్న పదునును ఎక్కడ చూపాలా అని కాపు కాస్తుంటారా?

యస్. కరుణాబాయి, మచిలీపట్నం




సెన్సారు వాళ్లకున్న బాధలన్నీ 'షో' జరుగుతున్న ఆ మూడుగంటల కాలమే. కోడి గ్రుడ్డుకు ఈకలు తీద్దామన్నట్లు — నవ్వకుండా, ఏడవకుండా. బిగుసుకుపోయి చెక్కబొమ్మల్లాగ చూస్తుంటారు.

మరణం మానవులకు మామూలే అని తెలిసికూడా మనిషి మృత్యువుకు భయపడతాడు, ఎందుకు?

ఎస్. ఎస్. ఆర్. మూర్తి, అనంతపురం

ఇన్నాళ్లు నాది, నావాళ్లు అని మమకారాలు పెంచుకున్న 'మనిషి' మరో క్షణంలో మృత్యువు నోటపడి ఏదీకాకుండా 'బూడిదై' పోవడం భయంకర విషయమేగా?

కళకోసం సినిమాల్లో చేరమనీ కొందరు యాక్టర్లు ఉపన్యాసాలు దంచుతారే, నిజంగా కళకోసం చేరిన యాక్టర్లెవరైనా వున్నారా?

ఆర్. ఆర్. వర్ధని, నాందేడు.

కళకోసం జీవితాన్ని అర్పించిన కళాకారులెందరో వున్నారు. అయినా కడుపు నిండితేనే కళ.

నిత్యజీవితంలో నటించు నటనకంటే, సినిమాలో నటించటమే కష్టమంటారు ఎందుకు?

జి. ఆర్. గణేశన్, అనంతపురం.

కృత్రిమంగా నవ్వాలి, కృత్రిమంగా ఏడ్వాలి, కృత్రిమంగా ప్రేమ నటించాలి. యిదంతా సహజమనిపించాలి. మరి కష్టమేగా?

దేవాలయాల్లో కూడ నగ్న చిత్రాలు ఉంచడానికి గల కారణం ఏమిటి?

కె. వి. యస్. సుబ్బరావు, మద్రాసు.




భగవంతుని మీద ఎంత వరకు భక్తి వున్నదనేటందుకు, అదొక పరీక్ష.

అందము స్త్రీకి శత్రువంటారు. మీరేమంటారు?

కె. శ్రీనివాసన్, కర్నూలు.




అందమే ఆనందం అంటాను.

మీరు ఎలక్షన్లో నిలబడితే నేను వోటు వెయ్యను, ఎందుకో తెలుసా?

మూర్తిజీ, విజయపురి నార్త్.

ఎలక్షన్లలో నిలబడకుండా కూర్చుంటాను. ఓటు వేస్తారా?

ప్రజల కింత సినిమాపిచ్చి ఎందుకండీ?

జి. మురళీ కృష్ణ, కొంకలూరు.

అయ్యా మీ-కెంత పిచ్చి లేకపోతే యీ ప్రశ్న అడుగుతారు.

ఈశ్వరుడు దేవుడే కదా! ఈశ్వరుడు ఎపుడూ తపస్సు చేస్తూనే వుంటాడు భక్తుడులాగా. ఇపుడు చెప్పండి. ఈశ్వరుడు భక్తుడా లేక దేవుడా?

జె. మురళీబాబు, ఏలూరు.

పార్వతికి గంగాదేవికి ఎప్పుడూ సిగపట్లే, ఎవరివైపు న్యాయం చెప్పినా శివుడికి 'డేంజర్'. ముక్కు మూసుకుని కూర్చుంటే ఏ గొడవ వుండదు. అందుకే ఆ దొంగ తపస్సు.

నేను ఎన్ని కథలు రాసినా అచ్చుకావడము లేదు. మరి నాది దురదృష్ట జాతక మంటారా?

కె. వి. లలిత, నంద్యాల.



ప్రింటు వెయ్యని వాళ్ళది అదృష్ట జాతకం.

మీకు 'పిఠా పద్మనాభం' అనేటంత ప్రీతి మిత్రు లెవరైన వున్నారా?

వి. వి. ఆర్, హైదరాబాద—28.

వున్నాడు తాతినేని ప్రకాశరావు.

యాక్టరులంతా మినిస్టరులయితే, ప్రేక్షకు లేమవుతారండీ?

జె. బి. జి. సుందర్, పెద్దాపురం.

ఓటర్లు మాత్రం కారేమో!

బిగువు దుస్తులలోని మర్మం ఏమిటి?

డి. జె. పాత్రో, బరంపురం.

మర్మం కాదు మహాశయా ఖర్మ.

సినిమాల్లో వదేపదే చూస్తున్నా, సినిమా తారవస్తే చూసేందుకు జనం అంతగా ఎగబడతా రెందుకండీ?

పి. లక్ష్మి, ఊళ్లపాలెం.

చీకట్లో చూడ్డానికి, వెలుతురులో చూడ్డానికి చాల తేడావుందిగా.

కాలేజీ అమ్మాయిలు కాలేజీ అబ్బాయిలకు కనబడగానే తెలియని అభినయంతో నడకను వెంటనే మార్చి నడుస్తారు, ఎందుకు?

కె. సుందర్, రాజమండ్రి.

బోనులో ఎలుకలా పట్టడానికి.

**బహుమతిపొందిన ప్రశ్న**

ఉద్యోగస్థులు జీతాలు పెంచాలనేకాని ధరలు తగ్గించాలని ఎందుకు సమ్మెచెయ్యరుసార్?

ఎస్. కె. యస్. మల్లికార్జునరావు, భీమవరం



'తాచెడ్డకోతి వనమెల్ల ఎందుకు చెడచాలి' అని.

# శవం ఎవరు తీయ్యాలి?

త్రివేంద్రంలో పోలీసు శాఖ చాలా హడావుడిగా వుంది. సెక్రటేరియట్ ముందు ఒక హత్య జరిగింది. శవం అక్కడే పడివున్నాదని విషయం ఎవరూ పట్టించుకోకుండా, ముఖ్యమంత్రి యింటికి ముందు కాపలా కాస్తున్నారు. అదేమిటంటే, ఆ శవం పడున్న ప్రదేశం ఏ బ్రాంచి పోలీసు శాఖకి సంబంధించినదో తేలియక పోడం కూడా కొంత కారణం అన్నారట కొందరు — ఇది సెప్టెంబరు 30న జరిగింది. కేరళ అంతా కల్లోలంగా వున్నసంగతి చంటి పిల్లాణ్ణడిగినా, చెప్తాడు— అది వేరె సంగతి. కొట్టక్కారా, క్విలన్‌ల మధ్య నడుస్తున్న ఒక బస్సును ఆపి, దానిమీద పెట్రోలు, కిరోసిను జల్లి, ప్రయాణీకులను దింపి మరీ (బస్సునే) తగలెట్టారుట. గుడ్డిలోమెల్ల ప్రయాణీకుల్ని వదిలారు- తోటి మానవుల్ని వదిలినందుకు జోహార్లు చెప్పాలి!!

## అల్లర్ల అంకెలు

మార్చి 2వ తేదీనుంచి జూన్ 12వ తేదీ వరకూ భారతదేశంలో మొత్తం 349 తిరుగుబాట్లు, అల్లర్లూ జరిగాయని, అనగా రోజుకి సగటున అయిదు అల్లర్లని లెక్కలు కట్టి తేల్చారు. ఇందులో మంత్రుల హింసవద్దనుండీ, పోలీసుల కాల్పులు, బస్సుల కాల్చుటవరకూ వున్నాయి. అంతవ డావుడిలోనూ 'ఆ శాఖ' తను చెయ్యాల్సిన పని చేసింది.

ప్రభుత్వానికి 1 28 లక్షలు రూపాయలు బాకీ వున్న పి. రామస్వామి అనే ఆయన మొన్న 29న కోయంబత్తూరులో ఒక హోటల్లో పేల్చుకుని ప్రాణాలు వదిలేశారట. ఆయన కలగాయం ఎంచాయితి ప్రెసిడెంటుట. ఈరకం ఆత్మహత్యలు దేశానికి కొత్త కాదు.

కాలేజీల్లో ట్యూషను ఫీజులు తగ్గించాలని హైదరాబాదులో విద్యార్థులంతా చేరి నినాదాలు చేసి, అల్లర్లు చేశారు. దాంతో పోలీసులు కర్తవ్యం నెరవేర్చారు ఫలితం నలభై మంది విద్యార్థులేగాక, 15 మంది పోలీసువరకూ గాయపడ్డారు. అదెలాగంటే నలుగువేల మంది విద్యార్థులు రాళ్ళురువ్వితే గాయపడరా— ఎందుకు పడరు?

నానక్ ఆనకట్ట పగిలిపోడానికి కారణం పునాదులు సరిగా లేకపోవడమేనని కేంద్ర వ్యవసాయ మంత్రి శ్రీ కే. యల్ రావు అన్నారు. అంటే అది ఇంజనీర్ల బద్ధకిస్తతనం అనచ్చునన్నమాట. వ్యక్తుల బద్ధకాలు యిలాటి నష్టాలు ఏర్పడితే వ్యక్తిత్వం చెడగొట్టే అవును ఏం చెయ్యాలి.

## తడిగుడ్డలలో షాక్

వానకి తడిసిన బట్ట దండెం మీద ఆరేయబోయి ఒకవ్యక్తి అడయారులో 5వ తేదీన అకస్మాత్తుగా చనిపోయాడు. ఆస్పిటలుతో కప్పిన ఆ యింటి పై భాగంనుంచి వచ్చే కరెంటు తీగలడిసి, కప్పంతా షాక్ యిచ్చిందని తేలింది. కొంతమందికి పళ్ళుకాలింది. ఈ రోజుల్లో బ్రతుకడమే కష్టంగావుంది- బ్రతుకగా కష్టంగా వుంది. ఇలాటి యిళ్ళు మద్రాసులో నూటికి 80 అయినా వుంటాయి. ఎటొచ్చీ ఆయుష్షుంటే ఏదీ ఏమై లేదనే వేదాంతం వంటబట్టడం వల్ల బ్రతుకుతున్నారు తప్ప.

తన భార్యకి, స్కూల్లో తనతో పనిచేసే కుమారస్వామి అనే అతనికి అక్రమ సంబంధం వుందన్న నమ్మకంతో ఇజాక్ అనే వ్యక్తి స్కూలులో కుమారస్వామిని పొడిచి చంపి, నేరుగా యింటికివచ్చి, తన భార్యనూ, యిద్దరు పిల్లలను కూడా చంపి పోలీసులకు స్వాధీనమై పోయాడు. ఇది తిరుచ్చికి 40 మైళ్ళ దూరంలోవున్న మనాయనూర్‌లో జరిగింది — ప్రతీకారం అనేమాటకు అర్థం ఏమిటో!

## వరదలు

ఇవలావుండగా వరదలు విజృంభించాయి. పూనె ఏనది పాట్నా వాసుల్ని చాలాభాగం పూరు ఖాళీ చేయించింది. ఆలోగ కొన్నవందల యిళ్ళను, ప్రాణాలనగా బలితీసుకుంది — పాపం!!

## సమ్మెలు

తమతో పనిచేస్తున్న నలుగురు పనివాళ్ళను తీసేసినందుకు నిరసనగా పంజాబు అగ్రికల్చరల్ యూనివర్శిటీ స్వీపర్స్ (కాలేజీ గదులు వూడ్చు వాళ్ళు అనచ్చు) అంతా సమ్మెచేశారు ఇది గతనెల 22న ప్రారంభం.

కొలరిడోలో ఒక డాక్టరుగారు తీరికలేక ఒక ప్రయోగం చేశారు. ముగ్గురు బాలికలను ఏసుకుని, ఒకరి లీవర్ ఒకరికి మార్చారు. ముగ్గురూ క్షేమంగానే వున్నారని, తన కృషి ఫలించిందని ఆయన సంబర పడ్డారు. పనికి పొగడాలికానీ, అసలాపని ఎందుకు చేసినట్లో— ఏమో మనకేం తెలుసు? శాస్త్రం ముందుకు పోతుంది. మనిషికూడా పడుతున్నాడు— పడనిద్దాం.

## తంజావూరులో కాల్పులు

తంజావూరువద్ద ఆరవ తేదినాడు జరిగిన పోరాటం తగాదాల్లో ఒక వ్యక్తి మరణించాడు అతను ఒకడు రైతు. తగాదాలనాపడానికి వచ్చిన పోలీసులు జరిపిన కాల్పుల్లో యీ విషాదం సంభవించింది. అసలు దానికి వచ్చినవారు కాల్పులెందుకు చెయ్యాలీఅంటే— వాళ్ళమీద రాళ్ళూ, రప్పలూరు రువ్వితే ఏం చేస్తారు? ఫలితం ధనప్రాణాలు నష్టాలు. దేశానికేగ!

హైదరాబాదులో మొన్న చపాతీలు తిన్న ఒక కుటుంబంలో ఐదుగురు వ్యక్తులు చనిపోయారు. ఆ చపాతీలు వారింట్లో చేసుకున్నవే. అందులో విష పదార్థం కలిసిందని, ఎలా కలిసిందో తెలియదని పరీక్ష తెల్పింది.

మరో విషయం— విపరీతాలు చదివిరాసేవేగాని, చూసి రాసేవికావు. అది సాధ్యంకాడాదు. వాస్తవానికి జరిగిన విషయం యథాతథంగా ఎక్కడా ఎప్పుడూ ప్రచురింపబడదు. ఒకేవూర్లో జరిగిన విషయం ఆ వూరి వారు నలుగురూ నాలుగు రకాలుగా చెప్తారు. ఎవరి వూహలు వారివి. అలాంటప్పుడిక ఫలానా విషయం అలాక్కాదు అని తర్జనభర్జనల ఫలితం ఏవుంది? ఇది గమనించాలి మనం.

—ఫాలాక్షుడు.





'సుఖదుఃఖాలు'లో వాణిశ్రీ.

# చిత్రలహరి

## ఇంటర్నేషనల్ ఫిలిమ్ !

'ఈ లోగా విశ్వశాంతివారి, 'వైజాగ్ టు హైదరాబాద్', సుందర్లాల్‌గారి చిత్రమూ ప్రారంభించాలి. ఆ తర్వాత మా స్వంత ప్రొడక్షన్ ఆంగ్ల చిత్ర నిర్మాణం ఆరంభించాలి. దీనికి దాదాపు 35 లక్షల రూపాయల వ్యయం అవుతుంది. హాలీవుడ్ నటులు దీంట్లో వుండరు. మన తెలుగువాళ్లే — వాళ్లు ఇంగ్లీష్ ఏక్సెంట్‌తో నటిస్తారు. ఈ భారీ ప్రాజెక్ట్‌కి కొంత టైము పట్టవచ్చు' నంటూ ముగించారు డైరెక్టర్ సి. యస్. రావు.

## గో హోమ్

'దాదా, మీరిక వెళ్లవచ్చు' అన్నారు దర్శకుడు వి. మధుసూదనరావు యస్. వి. రంగారావు అక్కణ్ణించి కదలుతూ 'గో హోమా?' అని అడిగారు. 'మంచివనే వెళ్లి మేకప్ కొంచెం డార్క్ చేయించుకోండి. సెట్‌లో వర్కుంది క్లోజప్స్ తియ్యాలి' అన్నారు మధుసూదనరావు. అంటే యింతకు ముందు అవుట్‌డోర్‌లో రంగారావుగారితో తీశారన్నమాట. అవుట్‌డోర్ అంటే ఎక్కడో దూరంగా కాదు. అక్కడే ఫ్లోర్‌కి ఎదురుగా వున్న ఆరుబయట్లో స్టూడియో విజయా, షూటింగ్: వీనస్ పద్మినీ కంబైన్స్ వారి 'లక్ష్మీ నివాసం' చిత్రానికి పన్నెండురీళ్లు పూర్తి అయిన యీ చిత్రంలో రంగారావు,



'స్త్రీజన్మ'లో కృష్ణ, ఎల్. విజయలక్ష్మి.

అంజలీదేవి, కృష్ణ, భారతి, వాణిశ్రీ, శోభన్‌బాబు, రామ్మోహన్, పద్మనాభం, విజయలలిత ముఖ్య పాత్రధారులు. గోవిందరాజన్ నిర్మాత, టి. వి. యస్. శాస్త్రి సహనిర్మాత.

* * *

ఇటీవల విఠలాచార్యగారిని వాహినీలో కలిసినపుడు — 'జగపతివారికీ, ప్రసాద్‌గారికీ మీరు చిత్రాలను డైరెక్టు చేస్తారని విన్నాను నిజమేనా?' అని అడిగాను. 'నిజమే, అడిగారు. డిసెంబరులో ప్రారంభిస్తాను. ఆ రెండు సంస్థల చిత్రాలకీ యింకా కథలు నిర్ణయంకాలేదు' అన్నారాయన. విఠల్ కంబైన్స్ పేరిట యిపుడు తామొక క్రైమ్ థ్రిల్లర్ (సోషల్) మొదలు పెట్టబోతున్నామని కూడా చెప్పారు విఠలాచార్య.

# సినిమా డైరీ

● అంజనా హేంద్ర, గారీ సోబర్స్ ఎంగేజిమెంట్ అయింతర్వాత చాలాకాలం మళ్లీ కలుసుకోలేక పోయారు. ఈ మధ్య గారీ మూడురోజులు విరామం దొరికినందువల్ల ఆమెకి లండన్ నుంచి ఎయిర్ రిటర్న్ టికెట్ పంపించాడు. అక్కడికి రమ్మనమని. ఆమె ఎయిలుదేరాలనుకుంటుండగా ఒక నిర్మాతవచ్చి మూడురోజులు వరసగా కాల్‌షీట్స్ వున్నాయని చెప్పిపోయాడు. ఏం చేస్తుంది పాపం, అంజా! ప్రియుణ్ణి కలుసుకునే ఆ అవకాశం కాస్తా అలా తప్పిపోయింది.

● దర్శక నిర్మాత బి. ఆర్. చోప్రా కుమారుడు రవి వచ్చేయేడాది ఒక చిత్రానికి దర్శకత్వం వహిస్తాడుట. ప్రస్తుతం తండ్రిదగ్గర అతను అసిస్టెంటు.

● మెహమూద్ వంటచెయ్యటంలో మొనగాడు. అతను కోడిగుడ్డుతో 21 రకాల డిషెస్ తయారు చెయ్యగలడు.

● దిలీప్ కుమార్ తమ్ముడు నసీర్‌ఖాన్—నితిన్‌బోస్ చిత్రం 'భవన'లో వేషం వేస్తున్నాడు. 'గంగ జమున'లో అతను చివరిసారిగా నటించి చాలకాలాద నటించనున్నాడు. నితిన్ కోరికమీద యిపుడు మళ్లీ నటిస్తున్నాడు.

● దర్శక నిర్మాత ఒ. పి. రాల్హన్ యిపుడు నిర్మించనున్న 'తలాష్' వర్ణచిత్రానికి కోటి రూపాయలు ఖర్చవుతుందిట. రాజేంద్రకుమార్, హేమమాలిని నాయకీ నాయకులు.

● ప్రముఖ దర్శకుడు సి. పుల్లయ్య కాకినాడ ప్రభుత్వ ఆసుపత్రిలో ఈ 1వ తేదీ తెల్లవారు ఝామున కన్నుమూశారు.

● సత్యజిత్ రాయ్ మొట్టమొదటిసారిగా ఒక క్రైమ్ థ్రిల్లర్‌ని తయారు చేస్తున్నాడు. దానిపేరు 'ఛిరిప్ ఖానా'.

● హాలీవుడ్ హాస్యనటి షిర్లీ మెక్‌లైన్ యీ మధ్య భారతదేశం వచ్చింది. తన గౌరవార్థం బొంబాయిలో ఏర్పాటుచేసిన ఒక విందులో ప్రసంగిస్తూ 'భారతదేశంలో నేనొకచిత్రం నిర్మించదలిచాను' అన్నది.

● శ్రీ పేకేటి శివరామ్ దర్శకత్వం వహించిన 'చక్రతీర్థ' కన్నడచిత్రం అక్టోబరు 7వ మైసూరు రాష్ట్రంలో విడుదల అయింది. 18 రోజుల్లో నిర్మించబడింది చిత్రం.

'మొన్ననే గుంటూరు శ్రీన్స్క్లబ్ రిసెప్షన్‌కి వెళ్లివచ్చాం, నేనూ, అంజలీదేవి, పద్మనాభం, గీతాంజలీ... ఇప్పుడు ఫత్తూరు అవుట్‌డోర్‌కి వెళ్తున్నాను' అన్నది కృష్ణకుమారి, వీనస్‌లోని మేకప్‌రూమ్‌లో. అవుట్‌డోర్ 'పెద్ద అక్కయ్య' చిత్రానికి. మేకప్ చేసుకుని సిద్ధంగా వుంది. 'ఎండొచ్చిందా?' అడిగింది. 'లేదు. మసాబుగా వుంది' అన్నాడు మేకప్‌మాన్ రమేష్. 'ఏమిటో రాత్రినుంచీ చాలా వర్షం కురిసింది. అయితే ఇంకా వడేసూచన ఉందన్నమాట' అంటూ నవ్విందామె. 'స్త్రీ జన్మ' చిత్రం కృష్ణకుమారికి ఎంతో పేరు తీసుకువచ్చింది అమె నటనా సామర్థ్యాన్ని

'అనుమానం పెనుభూతం'లో కె ఆర్. విజయ

రుజువు చేసే మరో చిత్రం 'పెద్ద అక్కయ్య' దీపావళికి వస్తున్నది.

* * *

'ఫైల్స్ సబ్జక్టు నొకటి ప్రారంభిస్తున్నాం' అన్నారు, సురేష్ పిక్చర్స్ అధినేత శ్రీ డి. రామానాయుడు. 'కరడు కట్టిన కఠిన హృదయాల్లో - కరుణ నింపిన పసిపాప కథ. నాలుగు పాటలు రెడీ చేసేశాం కూడా అప్పుడే! డిసెంబరుకి పూర్తి చెయ్యాలనే సంకల్పంతో వున్నాం' అన్నా రాయన. ఈ చిత్రంద్వారా శేషగిరిరావును దర్శకుడిగా పరిచయం చేస్తున్నాం' అని కూడా చెప్పారు. రామానాయుడు.

* * *

శేషగిరిరావు సురేష్ సంస్థలో శ్రీకృష్ణ తులాభారం, ప్రతిజ్ఞాపాలన, స్త్రీ జన్మ

మీ ముఖము మృదువుగా, మొటిమలు లేకుండా ఉంటుంది



Nital

ఔషధయుక్తమైన మొటిమల క్రీమ్

దీనిని ఏడు
7 రోజులు మాత్రమే
రాసుకొంటే మీ ముఖము
మృదువుగా,
మొటిమలు లేకుండా
ఉంటుంది



శః మొటిమలను పోగొట్టే, క్రిమినాశక, ఔషధ యుక్తమైన నితల్ క్రీమ్ డాక్టర్ల ప్రశంసలను పొందింది మరియు వారిచే సిఫార్సు చేయబడుతోంది అది అటువంటి చర్మ బాధలను పోగొట్టుటలో సహాయపడి, చర్మమును మృదువుగా చేస్తుంది మనోహరమైన సువాసనగల దానిని సమయములో ఉపయోగిస్తే, ముఖము మీద మచ్చలు పడవు

తయారుచేయువారు కొచ్చిన్ పామ్ ప్రైవేట్ లి, బొంబాయి 26 కొచ్చిన్-2
మెస్సర్స్ గణపతి & కంపెనీ,
103/104 లింగి చెట్టి స్ట్రీట్,
పోస్ట్ బాక్స్ నెం 1986, మద్రాసు 1

● పూర్తి వివరములు కావాలని వ్రాస్తే ఉచితముగా పంపుతాము

3 brothers / TB



# ప్రయత్నము హెచ్చుటకు ఉత్సాహము పెరుగుటకు మంచి రీతిలో దినమును ప్రారంభించుదాము

మాల్ట్, క్రీమ్‌పాలు, కంటికి గోచరించని విటమినులతో నిండిన ఆహారపానీయము చిన్న పిల్లలకు, పెద్దలకు అందరికీ ఉత్తమమైనది అరిగిపోయిన శక్తిని చేకూర్చును.




# ఓవోమాల్ట్

ఉత్సాహము హెచ్చును అదియే దేహమును పెంపొందించును



తయారీదారులు :
ఫుడ్స్ ఫ్యాట్స్ & ఫెర్టిలైజర్స్ లిమిటెడ్
తాడేపల్లిగూడెం (A P.)

వ్యాపార నిర్వాహకము •
115-B N S C. బోస్ రోడ్డు మద్రాసు-1.

iam/fff 0-2e

# చిత్రలహరి

చిత్రాలకు సహకార దర్శకుడుగా పనిచేసిన యువకుడు సురేష్ పిక్చర్స్ పతాకం కింద నిర్మించబడే 'పాపకోసం' చిత్రానికి మొదటి సారిగా దర్శకత్వం వహిస్తున్నాడు. శ్రీ రావు దొంగలుగా—త్యాగరాజు, సత్యనారాయణ, అర్జా జనార్దనరావు నటిస్తున్నారు. వారిలో పరివర్తనం తెచ్చిన పాపగా బేబీ రాణి నటిస్తున్నది. వీరితో ప్రభాకరరెడ్డి, పద్మనాభం, హరనాథ్ (గెస్ట్) పాల్గొంటున్నారు. నాయికగా దేవిక ఉండగలదని తెలుస్తున్నది. ఆత్రేయ రచయిత. పెండ్యాల సంగీత దర్శకుడు, యస్. వెంకటరత్నం ఛాయాగ్రాహకుడు. కె. యస్. ప్రకాశరావు దర్శకత్వ పర్యవేక్షణ.

—మోహన్‌కుమార్ ●

— — — —

# చేతకానితనం

(16-వ పేజీ తరువాయి)

భర్తలు సర్దుకోవలసిందే. పెద్దవారుకదా అని సలహాలకి పోతే పార్టీలుగా మారిపోయేవాళ్లే మన చుట్టాలు. అందుకే వీలైనంతవరకు జీవితం సాఫీగా సాగిపోవడానికి భార్యామణి తగినంత నేర్పుగా మసలుకోవాలి. భర్త తగినంత బాధ్యతలు వహిస్తున్నప్పుడు — ఆర్థికంగా కుటుంబ భారం, సాంఘికంగా కుటుంబపు అంతస్తు భరిస్తున్నప్పుడు, నిలబెట్టుకుంటూ వస్తున్నప్పుడు ఇంటి విషయాలలో అతగానికి మనశ్శాంతి, ఉత్సాహం కల్గించేపాటి బాధ్యత వహించకలేకపోతే ఎలాగ? 'ఇదింతే, నా జీవితం ఇలా వెళ్లవలసిందే' అంటూ సాగతీసి రాగాలాపనచేసేకంటే 'ఎందుకిలా కావాలి? జీవితంఎందుకు నేర్పుగా వహించుకు రాలేను?' అని ఓ క్షణం ఆలోచించుకున్న గృహిణి తప్పకుండా తన 'చేతకానితనానికి' జీవితపు విషమ సమస్యలు అంటగట్టడం మానేస్తుంది. క్రొత్త చిగురు తొడుగుతుంది ●




కార్నర్ అనే మాటకు మూల అని అర్థం చెబుతుంది నిఘంటువు. అయితే, కార్నరుకీ మూలకీ చాల తేడా కనబడుతూంది.

తెలుగులో మూలకి అంత చెప్పుకోతగ్గ ప్రత్యేకత ఏమీ లేదు. ఇంగ్లీషు పదం అయిన కార్నరు యథాతథంగ తెలుగులోకి వస్తే, దాని ప్రత్యేకత కేమీ ఢోకాలేదు. దాని తాజాదనం తగ్గలేదు.

రైళ్లలో— బస్సుల్లో— కార్నర్ సీటుకి ఎంత మోజూ, ఎంత గిరాకి, ఎంత పోటీ! ముసలివాళ్లు, ముసలివాళ్లు సయితం దాని సంపాదన కోసం ఎంత ఆరాటపడతారు?

'నాకు రొంపపట్టిందండీ' అనీ

'చుట్ట అలవాటు' అనీ

'పక్క స్టాపులో ఎవర్నో చూడా'లనీ (బస్సయితే)

'పక్క పెట్టెలో మా ఆడవాళ్లున్నా'రనీ (రైలయితే)

ఇలా సకారణంగా కనబడే సాకులు చూపించటం, మనకు గల సానుభూతిని బట్టి సహకరించటం, ఎరిపేటి.

అంగళ్లలోకెల్లా కార్నర్— షాపులకే గ్లేమర్ జాస్తి. నిజానికి, ఆ పేరే విన ముచ్చటగా వుంటుంది కూడా.

మొత్తం మద్రాసునగరానికి ఉండేటంతటి ప్రఖ్యాతి ఒక్క పారిస్ కార్నర్‌కి వుంది. లక్షలాది ఆఫీసు జనం రోజూ చేరుకునే రచబాటకు గమ్యస్థానమిది.

పోతే- మూల అనే రెండక్షరాల మాటకు నానార్థాలు చూడండి. మన పరిభాషలో ఇది ఒక నక్షత్రం. ఈ నక్షత్రకుడి పైన దుష్ప్రభావమే హెచ్చు అని దైవజ్ఞులు. మూల ఒక వ్యాధి. ఈ మాటకు పక్కని మరొక 'ము' చేరిస్తే 'ఆది' లేక 'మొదలు' అని అర్థము. 'మూలచేరు', 'మూల కూర్చొను' అంటే అవి పెడర్థాల కింద లెక్క.

మూలపురుషుడు, మూల కారణం, మూల విరాట్టు (కదలా మెదల లేనిది— దైవసంబంధ) వంటివి మరికొన్ని.

కాగ— కార్నరుకూ మూలకూ పోలేదంత వారు. ఈ రెండింటికీ ఎక్కడా పొత్తూ పోలికా లేదు. అదొక మూలా, ఇదొక మూలా.

కనుక— కార్నర్ అన్న మాటకి సాటికి సూటిగా పాళ్లా సరి అయిన తెలుగు మాటపుట్టే వరకూ కార్నరును తెలుగులో కార్నర్ అని వాడుకోటమే బాగు. అంతగా మరీ బాగుండదని తోస్తే పరు కాగితంలాగ మూలా- కార్నర్ అన్నా అనుకోవచ్చు. అంతేగాని, కార్నర్‌ని మూల అంటే మాత్రం నే ఒప్పుకోను.

నాతో మీరు ఏకీభవిస్తే, అంతమాత్రానికే ఉబ్బిపోయి, ఈ కార్నరు సీటు ఇస్తానని ఆశ పడేరు గనక. ఆరు నూరయ్యేది, నూరు ఆరయ్యేది పారిస్— కార్నర్ చేరేదాకా ఈ సీటు మాత్రం నాది. వదులను. ఆ ఆశ మరి వదులుకోండి. మా ఇంటి బస్టాపు నుంచి పారిస్ టర్మినస్ దాకా ఈ కార్నర్— సీటుకి నేను హక్కుదారుణ్ని. ఒక్కమాటలో చెప్పాలంటే— అయామ్ ది కార్నర్ కింగ్. అచ్చ తెలుగులో నేనే కార్నరుకు చక్రవర్తిని.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor, S. Sambhu Prasad.